శ్రీ

కలాభిలాషక కావ్యమాలిక.

# మానవవిధి. (౧)

తెలుఁగుసంధ్యావందనము.

S. S. M. PRESS, VIZAG.

శ్రీ

కళాభిలాషక కావ్యమాలిక.

విశాఖపట్టణ లండన్ మిషన్ హైస్కూలు

తెలుఁగుపండితుఁడు

# మారేపల్లి రామచంద్రశాస్త్రి

వ్రాసిన

# మానవవిధి,
# తెలుఁగుసంధ్యావందనము.



VIZAGAPATAM.

Printed by A. Venkatareddi, at the S. S. M. Press.

1904.

# గ్రంథరచనాభిప్రాయము.

---

విధి తెలిసిచేయు మహాత్ములు కొందఱున్నను మొత్తము మీఁద మనుష్యులై పుట్టియుఁ దమవిధియేదియో తమకుఁ దెలియనివారు పెక్కుఱుండు నట్లు నడతవలనఁ దేటపడుచున్నది. ఇది తలంచఁ దగిన మిక్కిలిజాలియగు. ఇఁక మనుష్యవిధి యొకవిధముగాఁ దెలిసియుఁ గొందఱు దానిని బాటించి చేయకయున్నారు. ఇది యెంతయు విచారకరము. ఇట్టి తోడివారి స్థితిఁగనుంగొని మనుష్యవిధి యిట్టిదియైయుండునని తెలిపిన మేలుకలుగవచ్చునను నాశతో సర్వేశ్వరుండు నాకొసంగిన కొలఁదిబుద్ధి నుపయోగించి, ఆ పరాత్పరునియందె భారముంచి, 'మానవవిధి, తెలుఁగు సంధ్యావందనము.' అను పేర నీచిన్నగ్రంథము వ్రాసినాఁడ. ఇందు, విద్యార్థులకు హితోపదేశమును, సంగ్రహముగా మనుష్యవిధియును, దానిసిగూర్చి సంవాదమును, దానిని నెఱవేర్పఁదగిన శక్తి యిచ్చు సంధ్యావందనమును గలవు. సంధ్యావందన మావశ్యకమని మొదట సిద్ధాంతపఱుపఁబడినది. ఇందలిసంధ్యావందనము సంస్కృతభాషాజ్ఞానము కలిగి సంస్కృతసంధ్యావందనము నుపయోగించి దానివలన ఫలము నొందువారికిఁ దప్పఁ దక్కిన తెలుఁగు తెలిసినవారి కందఱకుఁ బనికిరావలయునను నభిప్రాయముతో సంధ్యావందనోద్దేశముమాత్రము గొని వ్రాసినదిగాని భాషాంతరీకరణముగాఁ గొందఱికొఱకే వ్రాసినదికాదు. అన్నివర్ణముల స్త్రీపురుషులును దీనిని వాడుకొని మేలుపొందవలయుననుటయే దీని ముఖ్యాభిప్రాయము. విద్యార్థులకిచ్చిన హితోపదేశమున నిది

ముఖ్యముగా వారికొఱకు వ్రాయఁబడినదనుట, విద్యార్థులవిద్య ను గోరువారందఱుఁగాని ప్రత్యేకముగా బడికి వెళ్లి చదువుకొను పిల్లవాండ్రే కారనుటంబట్టి కాని వేరొకటి కాదు. నాకుఁగావలసి నవారు విద్యార్థులే. విద్యార్థులకే యిది కావలసియుండు. కాఁబట్టి జ్ఞానము సంపాదించుకొని, తాము బాగుపడి, తోడివారిని బాగు చేసి, దేశమును బాగుచేయవలయునను బుద్ధిగల తెలుఁగువారల కందఱకును 'మానవవిధి, తెలుఁగుసంధ్యావందనము' ను శిరోమణి గాఁ గానుక చేయుచున్నాఁడఁగాన వారు దీనిని సాదరముగాఁ గ్రై కొని, సరిగా వాడుకొని, పరమేశ్వరానుగ్రహముం గాంచి, తమవి ధియొనరించి, తనుజన్మము కృతార్థముగాఁ జేసికొందురుగాక.

ఇట్లు,

విశాఖపట్టణము.<br>
ది ౨౯-౧౨-౦౪.

అందఱి మేలుం గోరు గ్రంథకర్త,<br>
మారేపల్లి రామచంద్రశాస్త్రి.

# ధర్మమే జయము.



## కృతజ్ఞతాపూర్వక దేవగురువందనము.

గీ॥ మంచిపెద్దలు గనఁజాలు మనుజజనియు,
మంచిదారిని జేర్చిన మంచివారి
చెలిమియు నిడి మంచికె పనిచేయఁజేసి
పరమదయఁగాచు నీశ్వరా! వందనంబు॥

గీ॥ నన్నుఁగాంచి పెంప నెన్నియో కష్టముల్
పడిన పితరులార! వందనంబు;
విద్య బుద్ధి నీయ, వెతలఁబాపఁగఁ దోడు
పడిన సుజనులార! వందనంబు॥

గీ॥ మొగము నెదుటఁ జేసెడునట్టి బోధకంటె
నెఱుకవగ బోధకావించి హెచ్చు తెలివిఁ
గలుగఁజేసెడు నుత్తమగ్రంథములను
వ్రాసి తోడ్పడు కవులార! వందనంబు॥

[illegible] దేవరాయ ఆంధ్ర పాఠశాలయందు,
[illegible]

# పండితవందనము.

అయ్యలారా!

పరాత్పరుండు మీయందుండుఁగావున మీకు వందనములు. అనుభవజనిత జ్ఞానముంబట్టి యీ చిఱుగ్రంథంబునం దున్నదంతయుఁ దమకుఁ గరతలామలకంబె. గ్రంథరచనాభిప్రాయంబు తన్నామాకర్ణనంబుననె తమకు గోచరంబగు. పిదప నీవిధి యేమియో మీకుఁ దేటతెల్లంబె. ఇఁక నేను జెప్పవలసినది యేమియున్నది?

---

## విద్వాంసులకు విజ్ఞాపనము.

అయ్యలారా!

'మానవవిధి, తెలుఁగుసంధ్యావందనము.' అను నామముంబట్టియే యిది మీకొఱకుద్దేశింపఁబడినది కాదని యూహింతురు. అందుచే దీనిని జూడఁ దమలోఁ గొందఱకు బుద్ధియే పుట్టకపోవచ్చును; కొందఱిదియేమో చూతమని బుద్ధిపుట్టి చూడవచ్చును. ఎటులయినను గుణగ్రహణపారీణులగు తాము గ్రంథరచనాభిప్రాయము నారసి, ఇప్పటి మనవారిలోఁ బెక్కండ్రస్థితింబట్టి యిట్టిది కావలసినదియేయను గట్టి నమ్మకముతో నిందులకుఁ బూనుకొనిన నాయుద్యమము కృతార్థము సేయఁదగు సాయమొనరింపఁ బ్రార్థించెద.

---

# మానవవిధి.

## తెలుఁగుసంధ్యావందనము.

### విద్యార్థులకుహితోపదేశము.

తే॥ గీ॥ మానవులుగఁ బుట్టియుఁ గూడ మానవులను
పేరు గొనఁ దగకుండుట పేర్మి కాదు;
కాన మానవ విధి చేసి మానవుల న
నర్హు లనిపించుకొనుఁడి యో యయ్యలార ! ॥

ఈ 'మానవవిధి, తెలుఁగుసంధ్యావందనము' ముఖ్యముగా మీ
కొఱకు వ్రాయునదగుటచే మీకు నాలుగుమాటలు చెప్పవలసినవి
ధి నాయందున్నదిగావున వానిని నేనీక్రిందఁ బొందుపఱిచెద. మీ
రును శ్రద్ధతోఁజదువుఁడు. 'మానవవిధి యేమిటి? మాకు సంధ్యా
వందన మెందుకు? అది యక్కఱలేని యప్పుడు దానిని గూర్చి చె
ప్పుమాటలు చదువుటయెందుకు?' అన వచ్చెదరు కాఁబోలును.
దూరముగా నాలోచింపక యట్లనరాకుఁడు. మొదట మీవిధియేది
యో మీరు తెలిసికొనుఁడు. మీకు మీవిధియేదో తెలియకుండుట
యే యీగ్రంథము వ్రాయుటకు ముఖ్యకారణము. మీరు బాగుపడి,
యితరులను బాగుచేసి, దేశమును బాగుచేయఁ బూనుకొని పనిచే
యుటయేమీవిధి. ఇది తెలిసిన మీకును సంధ్యావందనముతోఁ బని

యున్నది. అందుచే దానినిగూర్చి చెప్పుమాటలు చదువుటకును బ
నియున్నది. అయిన మీరిట్టి మంచియుద్దేశమే లేనివారా? ఇప్పటి
కంతయుఁ గాకున్నఁ గొంతయైననుండదా? కొంతయున్నఁ దక్కి
నది దైవానుగ్రహమునఁ బూర్తి కాఁగూడదా? కాన మీరు బొత్తి
గా నట్టియుద్దేశములేనివారు కారు. కాఁబట్టియే నాశక్తి కొలఁది నే
ను మీకుఁ దోడుపడుటకుఁ బూనుకొన వలసివచ్చినది. నేను మీకుఁ
దోడ్పడునపుడు మీరుమాత్రము నాకుఁదోడుపడరా? తప్పక తో
డుపడుదురనియే నానమ్మకము. ఇంతకు మేము తోడుపడి చేయున
దియేమనియెదరేమో? వినుఁడు మరేమియు లేదు, నేను వ్రాసి
నసంగతులను జక్కఁగాఁ జదివి, దూరముగానాలోచించి, వాని
ప్రకారము నడచుటయే. మీరిట్లు చేయనియెడల నాప్రయత్నమంత
యు బూడిదలోఁబోసిన పన్నీరేయగు. కావున మీవిధి నెఱింగి, సం
ధ్యావందనము నవలంబించి, మీరు బాగుపడి, పైవారిని బాగుచేసి,
దేశమును బాగుచేసి, మీజన్మము సఫలము చేసికొనుఁడు.

అయిన 'మేముసంధ్యావందనము చేయకపోవుటచేతఁ జెడిపో
వుచున్నామా? అక్కఱలేని బెడద, సంధ్యావందన మెందుకు?' అ
ని సందియపడువారి సంశయములఁ దీర్చుట మొదటిపని గావున
దానినిగూర్చి కొంచెచర్చించి చూతము. ఇంతకు నిట్టిసందేహముల
కాస్పదంబగు

## సంధ్యావందనమన నేమి?

సంధ్యాకాలముల భగవంతునిగూర్చి చేయువందనమని చాల
మందికిఁ దట్టకపోదు. సరియేకాని సంధ్యలేవి? ప్రాతస్సంధ్య, మ
ధ్యాహ్నసంధ్య, సాయంసంధ్యయునని మూడు. ఇందు జాగ్రత్సు

షుప్త్యవస్థల సంధికాలములును సంధ్యలుగా గ్రహింపవలయు. కా
నఁ బైనిజెప్పిన సంధ్యలయందుఁ బరమేశ్వరుంగూర్చి చేయు వంద
నము సంధ్యావందనము. 'అయిన నది యెందుకుఁబుట్టినది' యని క
దా మీప్రశ్న. అయ్యలారా! మంచి దేదిగాని యెందుకుఁబుట్టును?
మంచికే పుట్టును. ఏమి యామంచియందురా? మ తేమి? మనల
బాగు చేయుటయే. కావున మనము బాగుపడి మనజన్మము సఫల
ముచేసికొనుటకుఁ బరాత్పరునిగూర్చి సంధ్యలయందుఁ జేయవలసి
న వందనము సంధ్యావందనము. తెలిసినదా?

మఱియొకమాట. ఈసందర్భమున నొకయంశము జ్ఞాపకము
రాకమానదు. ఏమంటిరేని, సమస్త విద్యానిధులును, సర్వజ్ఞులును,
దూరదర్శులును, పరోపకార పరాయణులును, అమానుష మహి
మాంచితులునగు మహర్షులుచేసిన కార్యములేవి శ్రేయస్కరము
లుగావు? అన్నియు శ్రేయస్కరములే. దూరముగా నాలోచింపక
నవనాగరికులు కొందఱు వారిపనులలో గుణముల గ్రహింపక నలు
సులేఱుఁబోయెదరు! ఇంతకంటెఁ దెలివితక్కువ నేతేయున్నదా? స
ర్వజ్ఞులై, సకల వేదశాస్త్రనిర్మాణదక్షులై, ప్రపంచతత్త్వము కరత
లామలకంబుగావించుకొని, స్వార్థపరాయణత్వ మణుమాత్రము
నులేక, లోకోపకారమే ప్రధానముగా నెంచుకొని, తమబుద్ధినంత
యు వినియోగపఱిచి, పరులకై తమజీవముల ధారవోసిన యామ
హాత్ముల కార్యములయందు నెఱసులెన్నఁ, దా మెందుకుఁబుట్టి నా
కోయును జ్ఞానమేలేక క్షుద్రజంతువులవలెఁ దిని తిరుగుచు, తుచ్ఛ
శరీర సుఖమే ముఖ్యముగాఁ జూచుకొనుచు, దూరాలోచనము గ
గనారవిందమై, తత్త్వజ్ఞానము శశకశృంగమై, పరోపకారము వం
ధ్యాసంతానమై తాముసు మనుష్యులమేయనుకొను వారికెన్నిగుం

జెలుకావలయును? ఇంతకు వారి తెలివితక్కువమాటలవలనఁబో వునదియేమి? గ్రుడ్డికన్నుమూసిన నొకటియే తెఱచిన నొకటియేయని వారిని లెక్కింపక యూరకుండుటకువీలులేదు. ఊరకున్న, వారు చెడుటయేకాక మంచిచెడ్డలెఱుఁగని పిల్లవాండ్రఁగూడఁ జెఱుతురు. కాననీసంగతి యెత్తుకొనవలసివచ్చినది. సిరియంటదుగాని శీఘ్రయంటునను సామెతవిన్నారుగదా. అట్లే మంచి వేగముగాఁ బట్టుపడదుగాని చెడ్డ పట్టుపడును. కాఁబట్టి చీడయంటుకొనకుండుటకు మెలఁకువగలిగియుండుఁడు. అంటిన వదలుట దుష్కరము.

ఇపుడు మనత్రోవకడ్డముగావచ్చిన ముండ్లకంచె తీసివేసినారముకావున నిఁకఁ దిన్నఁగాఁబోవచ్చును. మహాత్ములగు మహర్షులు చేసినవన్నియు శ్రేయస్కరములే. అందుచే నన్నియు శ్లాఘనీయములే. వానిలో సంధ్యావందనము వారి బుద్ధివైభవమంతయు నుపయోగించి చేసినదగుటచేతను, అనుభవములోనికిఁదీసికొనరాఁదగినదగుటచేతను, ఎప్పటికప్పుడు మేలుకలిగించునదగుటచేతను, అందుచేనొకనిజన్మము సార్థకముచేసి, యితరులజన్మము సార్థకము చేయించి, దేశాభివృద్ధిచేయునదగుటచేతను నామతమున నన్నిటిలోపలశ్రేయస్కరము, శ్లాఘనీయము.

అయిన, మీరు, 'ఇదంతయు సరియే కాని సంధ్యావందనమును మహర్షులను బొగడుటయే కనఁబడునుగాని మాకుఁగావలసిన సంగతి తెలలేదు' అనియెదరాయేమి? మీకుఁగావలసిన సంగతియేమి? సంధ్యావందనమువలనఁ గలుగు మేలు మనల బాగుచేయుటయేయని చెప్పియుంటినిగదా. ఏమి? యింకనుసందేహము బాధించుచున్నట్లు కనిపించుచున్నది.

# అది మనల బాగుచేయుటయెట్లు?

అనికదా మీసందియము. మంచిది. వినుఁడు. సంధ్యావందనము మనల నెట్లు బాగుచేయునో యనుసంగతి తేలుటకుముందు, బాగు చేయుటయన నేమో మనకుఁ దెలియవలయును. దీనికొక యుదాహరణము తీసికొందము. పొలము బాగుచేయుటయన నేమి? బాగు చేయుటకు సేద్యగాఁడేమి చేయును? పొలము బాగుచేయఁబూనుకొనిన సేద్యగాండ్రు మొదట దానియందుఁగల ముండ్లచెట్లు మొదలగునవి కొట్టివేసి, మెఱకపల్లములు సమముచేసి, గెత్తమువేసి దానిని సారవంతముగాఁ జేయుదురు. ఇదియేకదా పొలము బాగుచేయుట. దీనినిబట్టి సంధ్యావందనము మనలను బాగుచేయుననఁగా నేమి యెదరు? 'అది మనయందుఁగల చెడుగుణములను నిర్మూలముచేసి, మంచిగుణములుబ్బునట్లు చేసి, బాగుచేసిన పొలము పైరులఁబండింపఁ గలుగునదగునట్లు మనము మంచిపనులు చేయఁగలుగుటకుఁదగినస్థితిలోనికిఁ దెచ్చుటయే,' అయియుండవలయునందురుగాని 'ఎట్లు' అను ప్రశ్నమాత్రమువదలరు. తొందరపడకుఁడు. క్రిందనున్నవారు మేడపైనున్న వస్తువుల నొక్కసారి యెగిరిచూడవలయుననినవీలుపడునా? ఎంత వేగముగానయినను మెట్లన్నియు నొక్కొక్కటి యెక్కవలయును. అట్లేనిదియు. మొదట, సంధ్యావందనము మనచెడుగుణముల నెట్లు పోఁగొట్టుననునదియె తెలియవలసినయంశము. ఆలకింపుఁడు. దానివలన మనము ప్రతిపగలును, ప్రతిరాత్రియు మనయింద్రియములచేఁ జేయుపాపములనన్నిటినిదలఁచుకొని, చేసినందులకు మనస్సునవగచి, వానివలనఁగలుగుపాపము తొలఁగింపవలయునని భగవంతుని వేఁడుకొని, అట్టిపాపములు మ

అలఁజేయఁగూడదను నిర్ధారణముచేసికొనుట తటస్థించును. చూచి తిరా? దీనియందెంత మేలున్నదో! మనముచేయుపాపములు నశించుటకును, ఆపాపములుచేయుటకుఁ గారణములగు చెడుగుణములు తొలఁగుటకును నిజమగు పశ్చాత్తాపముకంటె నుత్తమసాధన మేది? అట్టిపశ్చాత్తాపము ననుదినమును బలుసారులు గలిగించునది సంధ్యావందనముగాక మఱియేది? అట్టిచోనదియే చెడుగుణముల నిర్మూలముచేయం గలదనుటకు నడ్డేమి?

అయ్యలారా! కంటిరా సంధ్యావందనప్రభావము? తెలిసికొంటిరా యది చెడుగుణముల నిర్మూలముచేయువిధము? మూఁడువంతుల ముప్పాతికదాని మహిమయిందులోనేయున్నది. ఇట్టిదూరదృష్టితో మొదట నీసంధ్యావందనము నేర్పఱిచిన మహాత్ముల బుద్ధివిశేషము రవంతయైన మన మెన్నఁగలమా? కృతజ్ఞతా పూర్వకముగ వందనములాచరించుటకంటె మనము వారిఋణము మఱియొక విధమునఁ దీర్చుకొనఁగలమా? వట్టిది. అయిన నీయంశమునసే సంధ్యావందనమును, దాని నేర్పఱిచినవారి నింతగా మెచ్చుకొననేలయందురేమో? అట్లనకుఁడు. ఇదియే యన్నిటిలో మిన్నగా నెన్నఁదగినయంశము. ముండ్లచెట్లుకొట్టి మంటఁబెట్టక పొలమునఁ బెంటకట్టుటకుఁగాని, పైరు వేయుటకుఁగాని వీలుపడునా? కోట తలుపులు విడఁగొట్టకదానిలోఁ జొచ్చుటకుఁగాని, స్వాధీన పఱచుకొనుటకుఁగాని శక్యమగునా? కోఱలూడఁబెఱుకక పామును లోఁబఱుచుకొనఁగాని, నిర్భయముగా నుండఁగాని వలనుపడునా? అట్లె సాధింపరానివై, తరువాతిపనులకెల్లనడ్డై, మనలఁ బాడుచేసి,యితరులఁ బాడుచేయించి, దేశాభివృద్ధికిఁ బెద్దమారియై

యుండు దుర్గుణసమూహమును నిర్మూలము చేయఁగలదానిని, దానిని మానవులకుఁ బెన్నిధానముగా నొసంగిన వారినిఁగొనియాడి సంతసించుటకంటె మేలుగోరువారి కెక్కుడగు నంశము మఱియొకటిలేదని నొక్కి వక్కాణింపవచ్చును.

ఇఁక, 'సంధ్యావందనమువలనఁ గలుగు సుగుణములేవి?' అందురు కాఁబోలును. ఇవియవి యననేల? అది దుర్గుణములనన్నిటినెటుల నాశనముచేయునో సుగుణములనన్నిటి నట్లే వృద్ధిపొందించును. చెడుగుణములు నశించిన వెనుక వానికి విరుద్ధములగు మంచిగుణములు క్రమముగా నంకురించి పెరుఁగును. ఇది వింతగాఁదోఁచునా యేమి? వింతయక్కఱలేదు. ముండ్లచెట్లు పెరిఁగి నశించిన పిమ్మటఁ బండ్లచెట్లు పుట్టి, పెరిఁగి, పండుటలేదా? ఇదియునట్లే.

ఇప్పుడు దుర్గుణములేవియో, సద్గుణములేవియో కొంతవఱకుఁ దెలియుటమంచిది. ముండ్లచెట్లకును, పండ్లచెట్లకును బొలమెట్లాధారమో, చెడుగొనములకును, మంచి గొనములకును మనసు నట్లే యాధారము.

## దుర్గుణములేవి?

ఒకవిధమగు వస్తువు మఱియొకవిధముగా నుండునట్లు తోపించు మోహమును, ఇతరులబాధ చేయు మనోవికారమగు కోపమును, తనదనుకొనువస్తువు నన్యులకీయనట్లుచేయు లోభమును, సుఖాతిశయంబుచే మంచిచెడ్డల నెఱుంగఁజాలనట్లు చేయు మదమును, పైవారి మేలుచూచి యోర్వనటుల చేయు మత్సరమును, ఇంద్రియసుఖములను గోరునట్లుచేయు కామమును, అంతయు నాశక్తివలననే యగుచున్నదని కొనునట్లు చేయు నహంకారమును,

పరులు తన్ను మెచ్చుకొనుటకే ధర్మముచేయించుదంభమును, గు
ణములను దోషములుగాఁ జెప్పించునసూయయు, తానే యంద
రికంటె గొప్పవాఁడనిపించు నరభిమానమును, తనది కాని వస్తు
వు దనదను కొనునటుల చేయునుమకారము మొదలగునవి దుర్గు
ణములు. వీనిలోఁ గామ క్రోధ లోభ మోహ మద మత్సరముల
నరిషడ్వర్గమనియు, అంత శ్శత్రువులనియుఁ జెప్పుదురుగాని నే
ను వీని శత్రుసేనానాయకులనియెద. వీరిలోఁగాముఁడు పెద్ద. వీ
రిమాటయేమనుః వీరియాధిపత్యముక్రింద నుండు నితరదుర్గుణభ
టులుమాత్రము సామాన్యులా? ఒక్కొకఁడు లోకముల నెల్ల వ్యా
కులఁబెట్టఁజాలు! ఇఁక వారి సేనానాయకులఁ గెలుచుట సుకర
మో దుష్కరమో మీరేయూహించుకొనుఁడు. వీరిలోఁ బ్రతివా
నికినురభ్యాస సమూహమను పెద్దబలఁగముకూడఁ గలదు. ఇట్టి సే
నను, సేనాధిపతులను బేరు నూరులేకుండ నేలఁగలుపు మహిమ
సాధారణమైనదనఁగలరా? అనఁజాలరు. ఇట్టిమహిమ దేనియందు
న్నది? సంధ్యావందనమునఁ గాక మఱి దేనియందున్నది? అయ్యా
లారా! దుర్గుణ విజృంభణమును, సంధ్యావందన మాహాత్మ్యము
నిట్టివని యిప్పుడైనఁ బొడకట్టినదా?

సరియె. ఇఁక,

## సుగుణములేవి?

మంచిచెడ్డలను దెలుపు వివేకమును, ఉన్నదియు- ప్రాణులకు
మేలుకలిగించునదియునగు సత్యమును, మనస్సును- మాటను- పనిని
నొక్కరీతిగానుంచు నార్జవమును, పైవారి సుఖదుఃఖములు తన
సుఖదుఃఖములుగాఁ దలఁచునట్లు చేయుసమత్వమును, జంతువు

లకుండుఖమును సహింపఁజాలునట్లు చేయు దయయు, దొరకినదాని తోఁ దనివినొందించు సంతుష్టియు, తనకుఁగలది పైవారికిప్పించు దానమును, కీడుగలిగించు పనులపై మనస్సును బోవకుండునటుల చేయు శమమును, చెడుపనులయందు బాహ్యేంద్రియములఁ దగు లకుండునట్లు చేయుదమమును, చేయరాని పనులు చేయకుండ వె నుకదీయించు లజ్జయును, గొప్ప చిక్కులు ఘటిల్లినపుడు చేయ వలసినపనులఁ జేయించు ధైర్యమును, పరులు తన్ను బాధించినను స హించునట్లొనరించు క్షమయును, మేలుగలిగించు కార్యములం గావించుచో నిలకడగలిగించు స్థైర్యమును, బీదసాదలదగ్గఱకుఁ జే రునట్లు చేయుమార్దవమును, ఎప్పుడును సుఖదుఃఖములఁ గలిగించు నింద్రియముల మీఁదియాసక్తి మాన్పు వైరాగ్యమును, కామక్రో ధాది దుర్గుణముల మనస్సునఁ జేరనీని సత్వము మొదలగునవి సుగు ణములు. అయిన సంధ్యావందనమువలన లభించు సుగుణము లివి యేనా? కావు. సాధారణముగా సుగుణములని యెన్నఁబడు ని వియేకాక, వీనికెల్లఁ దల్లి వేరగు దైవభక్తియు, సమస్తజ్ఞానంబున కాస్పదంబగు గురుభక్తియు, సర్వశ్రేయంబులకు మూలంబగు పి తృభక్తియు మొదలగునవి గూడఁ గలుగు. చూచితిరా?

## సంధ్యావందనమహిమ.

అది దుర్గుణములను ముండ్లచెట్లను గొట్టివేసి, వానిముండ్లెచ్చ టనైనఁ దలసూపిన నేఱి కాల్చి పొడిచేసి, మిగిలిన వేళ్లెప్పుడైన మఱల మొలకెత్తినఁ గలుపుదీసి, తాను వేసిన సుగుణములను పం డ్లచెట్లను పెన నభివృద్ధి పొందునటుల చేసి, మనస్సను పొలమును బాగుచేసి, ఫలింపఁజేసి మనకులాభ మొనరింపఁ జూచు. ఇట్టి సం

ధ్యావందనపుఁగాపును దిరస్కరించుట న్యాయమా? దూరముగా
నాలోచింపక పెద్దబింకములు పలుకుచుఁ దెలివితక్కువపనులు చే
యుటకు వీలగుబలమునిచ్చి శరీరమును బోషించు ముద్ద ముందు న
కు వచ్చుటకు సంవత్సరమంతయుఁ గష్టపడు కాపు నే మనము లె
క్కసేయ నప్పుడిఁక సంధ్యావందనపుఁ గాపును లెక్కసేయుచు
మా యందు రాయేమి? అనరు. ఇదివఱకుఁ దెలియక యాసననిప్పుడ
నఁజాలరు. ఇప్పుడనఁజాలిన వారి కేమియు నేనిఁకఁ జెప్పఁజాల.
నిజమునకుఁ బొలము కాపును, సంధ్యావందనపుఁ గాపునుగూడ మ
న్నింపఁబడవలసినవారే. అందులో మొదటికాపును మన్నింపవల
యునని నేర్పువాఁడగుటచే రెండవకాపు ఎక్కువగా మన్నింపఁదగి
నవాఁడు. ఇప్పుడేమనెదరు? ఇంకను 'సంధ్యావందనము చేయ
కపోవుటచే మేము చెడిపోవుచున్నామా?' యని ప్రశ్న వేయఁగల
రా? వేయలేరు. సంధ్యావందనము చేయకపోవుటచే నిశ్చయము
గాఁ జెడిపోవుచున్నారు. ముమ్మాటికిఁ జెడిపోవుచున్నారు. ఇప్ప
టికి మీకది మనస్సునఁ దట్టకతప్పదు. ఒప్పుకొనకతప్పదు.

లోకములో మంచివారని ప్రసిద్ధినొందినవారందఱు దాని న
వలంబించిన వారే. సంధ్యావందనావలంబనములేక పరిశుద్ధులమ
గుదుమనుట, నేలలేక నిలుతుమనుట, నీరులేక కడుగుదుమనుట, అ
గ్నిలేక వండుదుమనుట, వాయువులేక బ్రతుకుదుమనుట, ఆకాశ
ము లేక పోదుమనుట. అదియునుగాక లోపలిగుట్టు పెరువాళ్లకె
ఱుకయనునటుల తనగుట్టు తనకుఁ దెలిసినట్లు మఱియొకరికిఁ దె
లియదుగాన బాగుపడఁదలఁచినవాఁడు తనలోఁదానె పరిశుద్ధత
నొందవలయును. అట్టిపరిశుద్ధత సంధ్యావందన విధానంబునఁ గా

కే షుటి యొకదానివలనఁ గలుగదు. కావున నదియె మనుష్యులకొ
ఱంతలేకుండ బాగుచేయు సాధనము.

ఏమి? ఇంకను "మేము సంధ్యావందనము చేయకపోవుటచే
త నేమియుఁ జెడి పోవుటలేదు; సుఖముగా నున్నాము; అక్క
ఱలేని బెడద; ఇదిమాకెందుకు?" అనఁగల మహానుభావులు కొం
దఱున్నారాయేమి? ఉన్నట్టివారికొకమాట.

అయ్యలారా! దూరముగా నాలోచించుకొనుఁడు. క్షుద్ర
జంతువులవలెఁ దిని తిరిగి, యెవరికిఁ బనికిరాక, తాము పాడయి,
మీఁదుమిక్కిలి యితరులను బాధచేసి, లోకమున కపకారముచేసి
శత్రువులయి, చచ్చిరేని పీడవదలునని యనిపించుకొని చచ్చుటకా
భగవంతుఁడు మనుజులసృజించినాఁడు? కాదు. కావున దూరా
లోచనములేక చెడిపోకుఁడు. మీకుఁ దెలియకున్నఁ దెలిసినవారు
చెప్పినమాటవినుఁడు. మంచిత్రోవకురండు. మీవిధిని మీరు తెలిసి
కొనుఁడు. సంధ్యావందనము నవలంబింపుఁడు. ఈశ్వర సన్నిధా
నమునకుఁ జేరుఁడు. 'అయిననిప్పటిమాత్రోవ మంచిదికాదా?'
అందురా? నిజముచెప్పుమందురా?

## ఇప్పటి మీత్రోవ యడవిత్రోవ.

మొదటనే యింపుగానుండుఁగాని కొంతదూరము పోయినంత
నేమాయమగును. అటుగాకున్నఁ బెక్కుత్రోవలుగాఁ గనిపించు.
కాన నదియొకత్రోవ కాదు. అది మిమ్ము నట్టడవిలోనికిం గొనిపో
యి బయటికి రాఁదలఁచుకొన్నను రాఁజాలనట్లుచేసి చిక్కులం
బెట్టునది కాని యొకదరిచేర్చి సుఖపెట్టునది కాదు. ఇఁక 'దూర
ముగాఁబోము, త్రోవ మొదటనేయుండి సుఖించు వారమంటిరేని

యదియును మీయిష్టానుసారముగా జరుగునది కాదు. మీరు సాయం
కాలపు విహారముగా బయలుదేఱినారు. ఇక్కడక్కడకను నిర్ణ
యము లేక యాత్రోవను బడినారు. అడవిదగ్గఱకుఁ జేరినారు.
సూర్యాస్తమయపు వేళయగుటచే నిది యందముగానున్నది. కా
ని యీయందమెంతసేపు? మీసంతోష మెంతసేపు? క్షణము. చీఁ
కటికమ్మును. అడవి మెకములయార్పులువినవచ్చు; హెచ్చు. మీగుం
డెలు బితుకుబితుకులాడు. కలవరపడుదురు. కాళ్లుద్రొక్కుకొందు
రు. ఈసంక్షోభములో నేమృగమువచ్చిమీఁదఁబడునో, యేదినోట
వేసికొనిపోవునో చెప్పవీలులేదు. మీరుబయలుదేఱిననాఁడు చీఁక
టి రాత్రి కాక వెన్నెలరాత్రియందు రేమో! అట్లె యనుకొందము.
అయినదానిఫలమేమి? అడవి మెకముల భయముతప్పునా? దానిం
బట్టి యొకదానివెంబడి నొకటివచ్చు చిక్కులుతప్పునా ? పోనిం
డు. అవియేవియురావనుకొందము. అంతతోనయినదా ? మీరు కృ
తార్థులయినారా? ఏమిటిమీకృతార్థత? అసులోని పోఁగులచంద
మున నొకచోటనే చుట్టుఁజుట్టుఁ దిరుగుచుండుటయేకదా? ఇదియే
కదా మీరు మీత్రోవయిచ్చుఫలము? వెఱ్ఱివారలారా! దూరాలో
చనము లేక మీగోతులు మీరే తీసికొనకుఁడు. ఇప్పటికిని మీత్రో
వ మంచిదియే యనఁగలరా? అదిచక్కెరపూదిగిన విషమాత్ర. ము
సిఁడిపండు. ఎఱ్ఱగుచ్చినగాలము. నోరూరఁజేయుబోను. తెలిసిన
దా? మళ్లుఁడు. మంచిదారికిరండు. ఇంకను మేము పట్టినకుందే
టికి మూడేకాళ్లనితమచెడుదారి విడువకున్నవారున్న, వారికర్మ
ము. ఎవరేమిచేయఁగలరు? ముక్కుపట్టింపఁ గలముగాని నారా
యణాయని యనిపింపఁ గలమా యనునటుల మంచి యిదియ
ని చూపవచ్చునుగాని మొండికెత్తి యాదారిఁబట్టమనినఁ జేయున

దియేమి? ఎంతచెప్పినను దమమంచి తాము తెలిసికొనని వారిగతి 'ఏమి? సాయీబూ! చిక్కిపోవుచున్నావు' అనఁగోపించి 'చిక్కిపోయెదము, ఇంకను జిక్కిపోయెదము, చచ్చెదము, నీకెందుకు' అని జవాబుచెప్పు సాయీబుగారి గతియే. కావునఁ దెలివితక్కువమాటలును, తెలివితక్కువపనులును, తెలివితక్కువపట్టులును గట్టిపెట్టి మంచిదారికి రండు. బాగుపడుఁడు. మీజన్మముసార్థకము చేసికొనుఁడు.

## ఇది పండ్లతోఁటదారి.

ఇరుప్రక్కలఁ గంచెయుండుటచే మొదట బాగుగ ముండ్లపోట్లు తగులవచ్చునుగాని తరువాతి ఫలమో? కావలసినన్నిపండ్లు దొరకును. ఎప్పుడైనను వృగబాధలేదు. ఎటువెళ్లినను దారియే. ఎటువెళ్లిననుఫలములే. ఒకవేళమీరు, నాలుగుకాళ్ల మెకముల బాధలేకున్నను రెండుకాళ్ల మెకముల బాధయుండునందురేమో! అదినిజమే. ఆబాధకొంతవఱకుండునుగాని ప్రాణముతీయునది గాదు గావున నంతగా భయపడనక్కఱలేదు. మనము మ్రింగరాని మెతుకులవలె నిబ్బరముగానుండి న్యాయముగా నడుచుకొనుచున్న నీవింత మెకముల గొంతుకఁబడఁ దామేయుక్కిరిబిక్కిరియయి తమతప్పిదము దాముతెలిసికొని బుద్ధితెచ్చుకొని తమమానుషత్వమునుబొంది తిన్ననిదారికివచ్చునుగావున నీరెండుకాళ్ల మెకములనుగూర్చియు సందేహింపఁబనిలేదు. అదియునుగాక యితరులకును మనకును శాశ్వతసుఖము కలిగించుబాధ యొకబాధ కాదుగదా?

ఇఁక నెటువెళ్లినను దారియే యనుటచే నిదియు నొకదారి

కాదని చెప్పవచ్చెదరేమో! అదివట్టిభ్రమ. అడవితోవవలె నె
క్కుడకో తీసికొనివెళ్లి యాకస్మికముగా మాయమగునది కాక ఫల
మునిచ్చు స్థలమునకే కొనిపోయి మరల మొదట దారికిఁ దెచ్చునది
కావున నిది పైదానివంటి దెంతమాత్రము కాదు. పండ్లుదొరకినను
ముండ్లును గ్రుచ్చుకొను చుండు నేమో యనిన నవి కావలసినవే
యనెద. ఇదినుఱియు బాగుగ నున్నదందురు కాఁబోలును. తొంద
రపడి నాలుకచివరకు వచ్చిన ప్రతిమాటయుననీ, తోఁచిన ప్రతిపని
యుఁ జేసి నగుపాట్లపాలుగాకుఁడు. మీగౌరవము మీరే చెఱుపు
కొనకుఁడు. మీదూరాలోచనము లేమియే మిమ్మింతకుఁ దెచ్చుచు
న్నది. ముండ్లక్కఱలేకయే మీకుఁ బండ్లుకావలయునా? కష్టము ల
క్కఱలేకయే సుఖములు కావలయునా? ముండ్లుముందా? పండ్లు
ముందా? కష్టములుముందా? సుఖములుముందా? కష్టపడక ఫల
ముగలుగునా? దున్ని పైరుపెట్టక పొలము పండునా? చదివి వ్రా
యక పరీక్షయగునా? ధాన్యము దంచి వండక యన్నము సిద్ధము
గునా? కావున సుఖములకుఁ గష్టములు కావలె. కష్టములు లేని
చో సుఖములు రుచింపవు. కష్టములులేనిచో సుఖములు సుఖములు
కావు. ఇందులకొక యుదాహరణము- లడ్డు, జిలేబి, హల్వా మొ
దలగు తీపివస్తువులు వడలు, పకోడీలు మొదలగు కారపువస్తువుల
తోడులేక ప్రత్యేకముగా మీరు దినఁగలరా? తిందురనుకొందము.
తినినఁ గొంతసేపటికవి మొగము మొత్తించి రుచి చెఱుపవా? రు
చి చెడినవెనుకఁ దినకున్న నెంతఫలమో తినిన నంతే ఫలము. చూ
చితిరా? యీక్షుద్రసుఖములస్థితియే యిట్లున్నప్పుడిఁకఁ గష్టము
లులేనిచో నిజమగుసుఖములు సంతోషదాయకములగునా? కాక
పోయిన నవి సుఖములనిపించుకొనునా? కావునఁ బండ్లుగోరువా

రు ముండ్లకు జడియఁగూడదు. సుఖములుగోరువారు కష్టములకు జడియఁగూడదు. జడిసిన సుఖములురావు. కావున వెఱ్ఱిమాటలు చెప్పరాక దయాకరుఁడగు పరమేశ్వరుండిచ్చిన వివేకపుఁగన్నువిప్పి నలుపి చెడ్డల దూరముగాఁ జూడుఁడు. చెడ్డదారిఁబడక మంచిదారిఁ బట్టుఁడు. దేవునికిఁ బ్రియులగుఁడు.

ఎందుకుఁగొందఱు నవ్వెదరు? దేవుఁడున్నాఁడా యనియా?

## ఏమి! దేవుఁడే లేఁడా?

మూర్ఖులారా! దేవుఁడు లేనియెడల మీరును లేరు. ఏమి? మోము చిట్లించి కనులెఱ్ఱచేసెదరు. మొగము చిట్లించి కనులెఱ్ఱ చేయవలయునా? మాటియేమైనఁ జేయవలయునా? మేముండఁగ లేరనియెదవేమి? అనెదరు కాఁబోలును. సరియే కాని దేవుఁడు లేఁడనినంతులకు మిమ్ము నట్లే యనవలసియుండునేమో! దానికి మేము కనఁబడుచున్నాము, దేవుఁడు కనఁబడుట లేదందురా యేమి? ఇంతకు 'కనఁబడుట' యనునర్థమేమి? కంటికిఁ దెలియుట- కంటఁబడుటయేనా? అట్లయిన మీకంటఁబడని ప్రతివస్తువు లేదందురు కాఁబోలును. మీరుచూడని పరదేశమందున్న మనుష్యులందఱు లేరందురా? ఉన్నారని విన్నాము గాన నట్లనెదరు. ఎక్కడనో యున్నవారిమాట యెందుకు? అంతటనుండు గాలి మీకంటఁబడుచున్నదా? మీకంటఁబడుట లేదని యది లేదందురా? అది మా చర్మమునకుఁ దాఁకుచున్నది గాన లేదనమందురు. అట్లయిన దీనినిబట్టి యింద్రియములలో దేనికిఁగాని తెలిసిన వస్తువున్నట్లె మీరొప్పుకొందురా? దానికేమైన సందేహమున్నదా? ఏమియు సందేహము లేదందురు.

అయిన మనస్సను నొక యింద్రియమున్నదని మీకుఁ దెలియు నా? తెలిసినట్లె యని యనవలయు. అయిన మీమనస్సనకెప్పుడుగాని దేవుఁడున్నాఁడని తట్టలేదా? లేదని నిస్సందేహముగాఁ జెప్పవత్తురు. సరియె కాని, సుఖములయందుఁగాదు; దుఃఖముల యందు? లేదన సాహసింతురా? దైవమా! దేవుఁడా! భగవంతుఁడా! అను ముక్కలు మీనోట నెప్పుడు రాలేదా? రాలేదను కొందము. పాడుదేవుఁడు నన్నిట్టిబాధ పెట్టుచున్నాఁడనుకొన లేదా? పైకట్లనకపోయిన మనస్సునకుఁ దట్టలేదా? దేవుఁడున్నాఁడనిగాని, దేవుఁడాకష్టములు మాకుఁ గలిగించుచున్నాఁడనిగాని, అట్టి కష్టములఁ దొలఁగింప దేవునికి మొఱపెట్టవలయుననికాని మీ మనస్సునకుఁ దట్టలేదనుకొందము. మీరు నెఱవేఱుననుకొనినపని నెఱవేఱనప్పుడుగాని, నెఱవేఱదనుకొనినపని నెఱవేఱినప్పుడు గాని, తలఁపని తలంపుగా నొక సుఖమైనను గష్టమైనను వచ్చినప్పుడుగాని మీకుఁ దెలియరాక మీశక్తికంటె మించినశక్తియొకటియుండి యట్టి కార్యములు జరిగించుచున్నదనిదైన మీమనస్సునకొకప్పుడుగాకపోయిన నొకప్పుడైనఁ దట్టినదా? లేదా? తట్టియుండవలె. మీకుఁ దెలియరాక యన్నిపనులను జేయు శక్తియే సర్వశక్తి. ఆసర్వశక్తియే దేవుఁడు, భగవంతుఁడు, పరాత్పరుఁడు, పరమేశ్వరుఁడు.

ఇట్లు తట్టనివారికి మనస్సను నింద్రియమే లేకపోవలెను. కాని మనుష్యులకు మనస్సుండకపోదు. ఉండిన నాసంగతి తట్టక మానదు. అయిన, మనస్సుండిన యెడల నది గ్రహింపవలసిన యంశము కొంచెముగూడ గ్రహింపలేకపోవుటయెట్లు? అని యాశ్చర్యపడుదురేమో. అక్కఱలేదు. కన్నుండియుఁ బొరగమ్మినపుడు

చూడఁగలుగునా? అట్లైన మనస్సును మోహాదులచేఁ గప్పఁబడిన పుడు పరాత్పరుఁ గనఁజాలకపోవు. అట్టివారికిఁదోఁచుటయు మనకు విధిగావున దేవుఁడుగలఁడను నమ్మకముగలవారు మనకాలము వ్యర్థముగాఁ బోవుచున్నదని తొందరపడకుఁడు. మనమేలేమనము చూచుకొనుట గొప్పగాదు. పైవారిమేలు ముఖ్యముగాఁ జూడవలయు. కావునఁ గొంచెముతాళుఁడు. మనుష్యుల మనుకొనియు దేవుఁడులేఁడని తెలివితక్కువపనులుచేసి చెడిపోవు నీతెలివితక్కువాండ్రను మఱికొంచెము బోధించి మంచిదారిలోనికిఁ దీసికొనిరాఁ బ్రయత్నింతము.

అయ్యలారా! మనమిప్పుడు దేనినిగూర్చి చర్చించుచున్నాము? దేవునియునికింగూర్చి. దేవునియునికింగూర్చియా? మంచిదేకాని మీరు దేవుఁడులేఁడను వారుగదా? దేవునిగూర్చియని యెట్లు చెప్పినారు? వస్తువున్నప్పుడుగదా పేరువచ్చును. వస్తువులేని పేరుండునా? ఉండదు. కాఁబట్టి మనమున్నవస్తువును గూర్చియే చర్చించుచున్నాము గాని లేనివస్తువునుగూర్చి చర్చించుటలేదు. అందువలన దేవుఁడున్నాఁడు. మీరున్నవస్తువు లేదని వాదించుచున్నారు. ఏమనియెదరు? ఇప్పుడైన దేవుఁడున్నాడని యొప్పుకొనియెదరా? ఒప్పుకొనరా? ఏమి యాలోచించుచున్నారు? మేము మీరున్నదనిచెప్పినవస్తువు లేదని వాదించుచున్నాముగాని మేమున్నదని చెప్పినవస్తువు లేదని వాదించుటలేదు కావున మావాదమునకు బాధకములేదందురు కాఁబోలు. ఆఁ! మీరేమి తెలివితక్కువవారా? అయిన నేనొకఁడనే కాఁబోలును దేవుఁడున్నాఁడని చెప్పువాఁడను? కాకున్న నేమి? అనేకులున్నారనుకొందము. దానివలన మాకు బాధయేమున్నదందురు. పోనిండు. మఱియొకమాట. దేవుఁడున్నాఁడను

వారిప్పుడు క్రొత్తగాబయలుదేఱి నారంమరా? పూర్వముకూడ నున్నారందురా? పూర్వముమాత్రమున్న నేమంచురాయేమి? మీ రేమైననఁగలవారే. అయినఁ జెక్కు వేలేండ్ల క్రిందటనే దేవుఁడున్నాఁడని తెలిసికొనినవారును, అప్పటినుండియు నాప్రకారము గా నమ్మినవారును, ఇప్పుడునమ్మువారునందఱును మీకంటెఁదెలివి తక్కువవాండ్రును, మీరే తెలివికలవారు ననియా మీయభిప్రాయము? ఊరియందఱిది యొకదారి యులిపికట్టెదిమఱియొకదారియ నునట్లు నడిచి చెడిపోకుఁడు. దూరముగా నాలోచింప లేకపోవుట చే దేవుఁడున్నాఁడను సంగతి మీకుఁ దట్టకున్నఁ దట్టలేదనుఁడు గాని దేవుఁడులేఁడని మొండివాదము చేయకుఁడు. తప్పు. పూర్వము మనమహర్షు లెంతకాలమో తమబుద్ధినంతయు వినియోగపఱిచి యాలోచించియే దేవుఁడున్నాఁడని నిశ్చయించినారు. పైదేశములయందును బుద్ధిమంతులట్లె నిశ్చయించినారు. అందు చేతనే యిప్పుడు లోకములో నేయూపుననో దేవుఁడు కలఁడను వారే లేఁడనువారికంటె నెన్నిరెట్లో యెక్కువగా నున్నారు. కావున నింతమందియున్నదను వస్తువు మీరులేదనుట వెఱ్ఱిగాని మఱియొకటికాదు.

గ్రుడ్డివాఁడు తానుజూడఁజాలని రంగులేదనఁగలఁడా? చెవిటివాఁడు తానువినఁజాలని ధ్వని లేదనఁగలఁడా? ముక్కిఁడి వాసనలేదనఁగలఁడా? జ్వరరోగి రుచిలేదనఁగలఁడా? తిమ్మిరిపట్టినవాఁడు వేఁడిమి లేదనఁగలఁడా? అనఁజాలఁడుగాని యనవచ్చును. అనినఁ బైవారేమిచేయుదురు? నవ్వుదురు; కనికరింతురు; ఉన్నసంగతిచెప్పుదురు. ఇందువలనఁ దేలినదేమి? ఆయాగుణములను దెలిసికొనలేకపోవుటకుఁ గారణము వారివారికిఁగలలోపముగాని గు

ణము లేకపోవుటకాదు. అట్లే మీరు దేవుఁడున్నాఁడని తెలిసికొనలే కపోవుటకుఁగారణము మీకుఁదగిన తెలివి లేకపోవుటగాని దేవుఁడు లేకపోవుటకాదు. ఏమి? మాకుఁ దెలివి లేదాయని దెబ్బలాటకువచ్చె దరాయేమి? తాళుఁడు. మీకుఁ బొత్తిగాఁ దెలివి లేదనలేదు. తెలివి యున్నదిగాని తగినదిగాదు. మీరు తగినట్లు చేసికొనవలె. పోలికగ ల రంగులభేదము తెలిసికొనుటకుఁ గంటికి మంచియలవాటు కావ లె. పోలికగల వాసనలలో భేదము తెలిసికొనుటకుముక్కునకుమం చియలవాటు కావలె. పోలికగల ధ్వనుల భేదము తెలిసికొనుటకుఁ జెవికి మంచియలవాటు కావలె. అయినసందఱికన్నులు, ముక్కు లు, చెవులు నొక్కవిధముగానుండవు. కొందఱాయా భేదములు సులభముగాఁగ్రహింపఁగలరు. కొందఱు కష్టముమీఁద గ్రహింపఁ గలరు. కొందఱు గ్రహింపనేచాలరు. కొందఱాయాయింద్రియము లశక్తి, జబ్బువలనఁగాని మఱియొకయడ్డువలనఁగాని తగ్గిపోవుట చే గ్రహింపఁజాలరు. కొందఱు గ్రహింపఁగలిగియు గ్రహించు టకుఁ బ్రయత్నింపరు.

మీరు బొత్తిగా గ్రహింపఁజాలనివారును గ్రహింపఁగలిగియు గ్రహింపఁ బ్రయత్నింపనని మొండియెత్తెత్తినవారును గానియెడ ల మఱియొక మాట వినుఁడు. ఎప్పుడైనఁ జెడుపనియేదైనఁ జేయు టకుఁ దలఁచినప్పుడు ప్రతివానికి మనస్సులోపల నిదికూడును గూడ దను సంవాదము జరుగుట మీకుఁ దెలియునా? ఒకవేళ నంతగా సంవాదము జరుగకపోయినను 'నీవు చేయుపని మంచిదికాదు; చే యవలదు' అని యెవరో మీకు బోధించినటులయినను దట్టలేదా? మీరు బుద్ధిగలవారైనయెడల నిట్టిపని జరిగినటుల తట్టకమానదు. తట్టినను మీరు మొండికెత్తి దానిని లక్ష్యము చేయకపోవచ్చును. ల

త్న్యము చేయకపోవుట మంచిదికాకపోయిన నది వేఱేమాట. ఏ మి? ఏమనియెదరు? సందేహింపక నిజముచెప్పుఁడు. నిజముచెప్పు ట తప్పుకాదు. చెప్పరేమనిన నటుల తట్టిననేమి యనవలయును గాని మీకు మఱియొకదారిలేదు. మఱియేమియులేదుగాని యటు ల మీకుబోధించువారెవరు? మీరుచెప్పఁజాలరా? చెప్పరా? మీ రుచెప్పఁజాలకున్నను చెప్పకున్నను నాకుఁదప్పదు. మానకటుల చె డుపని చేయవలదని బోధించునది పరమాత్మ. ఆపరమాత్మయే దేవుఁడు.

ఏమి? మహానుభావులారా! యిప్పటికైన దేవుఁడున్నాడని యొప్పుకొనియెదరా? ఒప్పుకొనరా? పరమాత్మయే దేవుఁడైన యెడల నొప్పుకొందుమందురు కాఁబోలు. నిస్సందేహముగాఁ బ రమాత్మయే దేవుఁడు. ఇప్పటికి మీరు దేవుఁడుగలఁడని యొప్పుకొ నుటచే మనమందఱముఁ గృతార్థులము.

ఇఁక మనము ముందడుగు వేయవచ్చునా! వేయవచ్చునని యే యంనఱియభిప్రాయము.ఏమది? ఏమూలనుండియో మాటలుఁగు వినవచ్చుచున్నది. ఇంకను దేవుఁడు లేఁడనువాఁడెవఁడైనఁ గలఁ డాయేమి? 'ఉన్ననేమి? వానితో మనకేమి?' అనియెదరా? అటులకాదు. పానకములోని పుల్లతెఱంగున వానినడ్డుగా నుంపఁ గూడదు. ఉంచిన మనపనికే యడ్డువచ్చును. కావున వానికి నొక మాటచెప్పి వానియడ్డు తీర్చుకొందము. అయ్యా! తమకింకను దే వుఁడు లేఁడా? మంచిది. మీకొఱకిప్పటికి దేవుఁడు లేఁడనియే యను కొందము. ఇఁతకుఁ దేవుఁడు లేఁడని తమరనుటఁయెందుకు? దేవుఁ డు లేని వారికి స్వర్గములేదు; మోక్షములేదు; నరకములేదు. అందు

చేఁ దాము తమయిచ్ఛవచ్చినట్లు నడువవచ్చును. కాఁబట్టి దేవుఁ
డు లేఁడనుట స్వేచ్ఛగానడుచుటకుః కాని,

స్వేచ్ఛగానడుచుట మంచిదా? కాదా?

అను సంగతి చూడవలె. మొదట స్వేచ్ఛగా నడుచుటయననే
మి? కామక్రోధాదులకు లోనయి కోరరానివికోరుచు, అనుభవిం
పరానివి యనుభవించుచు, మంచివారిని దిట్టుచుఁ గొట్టుచు, పరు
లు బాధపడుచుండుట చూచియుఁ దనకుఁ జేతనయినవఱకైన ధన
సహాయముగాని వాక్సహాయముగాని చేయక పైపెచ్చువారి
మోసముచేసి, వారిసొమ్మపహరించి, వారిపైలేనినిందలుమోపి,
మనస్సులునొప్పించి బాధించుచు, నాకాయుష్యము నాకారోగ్య
ము నాకుధనమని యెల్లప్పుడు తనమేలేచూచుకొనుచు, శరీరము
స్థిరముగానెంచి లేచినది మొదలు పరుండువఱకుఁ బొట్టనించుకొ
నుటకే దేవులాడుచు, నిమిషమున నశించు శరీరభోగములు ము
ఖ్యములుగాఁ దలంచి విలువగలబట్టలు నగలు మొదలగునవిధరించి
దిద్దుకొనుచు, అక్కరలేని వేషములు వేయుచు, ఒయ్యారులను మె
ప్పించి వారివలన సుఖించుట కడ్డమైనగడ్డితినుచు, రోగములఁగొని
తెచ్చుకొని యిల్లును, ఒళ్లును గుల్లయై యేడ్చుచు, ఎప్పుడునుమాన
మును, ఒకప్పుడుప్రాణమును బోవునట్లు తాఁపులుదినుచు, గౌర
వమిచ్చి తెచ్చుకొనుమనుసంగతి తెలియకమన్నింపఁదగిన వారిమ
న్నించి మన్నింపఁబడక ధిక్కరించి యవమానపడుచు, పైపచ్చ
మోర్వలేక యితరులకొంపలు తీయుటకుఁ బన్నాగములుపన్ని తా
మే తమకొంపలు తీసికొనుచు, నాచేతఁగానిపని లేదనియు నన్ను
మించినవాఁడు లేఁడనియు విఱ్ఱవీఁగుచు, లోకమునకు శత్రువై యి

ట్టివాఁడు పుట్టిన నేమి? చచ్చిన నేమి? యనియో, చచ్చినఁ బీడవదలుననియో దీవనలొందుచునుండుటయే కదా. ఇది దేవుఁడు లేఁడనుటవలన వచ్చిన ఫలమే కదా?

దేవుఁడు లేఁడని నందులకీ లాభము చాలదా? వేఱేనరకము కావలయునా? కావలయుననిన లేకపోలేదు. ఎక్కడనున్నది? చచ్చినతరువాత నున్నదో మానినదో యెవరికిఁ దెలియు? ఎవఁడు చూచివచ్చినాఁడు? అని దెబ్బలాటకు రానక్కఱలేదు. నేను జెప్పునరకము చచ్చినతరువాతఁ బరోక్షమునఁ గాదు, బ్రతికియుండఁ బ్రత్యక్షముగా నిచ్చటనున్నదియే. అది దేవుఁడు లేఁడని స్వేచ్ఛగా నడుచు ప్రతివాడు ననుభవించునదియె. ఏమి? మీకు వింతగానున్నదిగాని వింతయక్కఱలేదు వినుఁడు. ఎవఁడుగాని యేదో చెడుపని చేయఁదలఁచినపుడు పరమాత్మ యదికూడదనిబోధించును. ఆబోధవినినడుచుకొనినవానికి బాధయేమియు లేదుగాని దానిని లక్ష్యము చేయక చెడుపని చేసినయెడలఁ జేసిన క్షణము మొదలుకొని పరమాత్మ వానిని బాధించుచునేయుండును. చేసిన చెడుపనికొలఁది బాధ హెచ్చుచుండును. కొన్ని చెడుపనుల బాధయెప్పటికి నుండునదే. ఇదినరకము కాదందురా? నోరు మెదపఁజాలరు. ఇంతటితోనైనదా? సుఖములకని వెళ్లఁగాఁ జెడునడతచే శరీరము చెడి, పుచ్చి, యెల్లప్పుడు తీపులుతీసికొనుచుఁ గుల్లి చచ్చువారి నెందఱిని మనకన్నులార మనముచూచుటలేము? ఇదియే పెద్దనరకము. ఈ నరక మేల వచ్చినది? దేవుఁడు లేఁడని యిచ్చవచ్చినట్లు నడుచుటవలన. ఇప్పుడు స్వేచ్ఛగా నడుచుట మంచిదో కాదో మీరే చూచుకొనుఁడు. ఇది ప్రత్యక్షప్రమాణముగాని యను మానము గాదుగదా. అందువలనఁ బునర్జన్మమున్నదని యొప్పుకొననివా

రికిని వాకట్టే. కావునఁ బ్రత్యక్షముగా దేవుఁడున్నట్లు తెలి యవచ్చుచున్నను లేఁడనిన వారును, దేవుఁడు లేఁడనుటవలనఁ ద మకుఁ గలుగుబాధ ప్రత్యక్షమగుటచే లేదనఁజాలరు గాన నీప్రత్య క్షప్రమాణమే దేవుఁడుకలఁడనుసంగతి వారికి సిద్ధాంతపఱిచి చె ప్పును. ప్రత్యక్షప్రమాణముకూడ నమ్మనను వాఁడున్నయెడల నట్టి వాఁడు వెఱ్ఱివాఁడై యుండవలయును గనుక నట్టివానికి వెఱ్ఱి కు దురువఱకు నది బోధపడదు. ఇచ్చట నట్టివారిపని లేదు కావున ని జముగా నిప్పుడు మనమందఱమును కృతార్థులము.

దేవుఁడుకలఁడను నమ్మికయే మంచికిమూలముకావున నదియే మనలఁ గృతార్థులఁజేయును. మనము గని బంగారమువంటివారం డ్రము. దైవభక్తి నిప్పువంటిది. రకమునుబట్టి కాలములో నెచ్చద కు౯వలున్నప్పటికి, నిప్పు బంగారము నెట్లు పరిశుద్ధముగాఁజేయఁ గలుగునో దైవభక్తియు మనలఁ బరిశుద్ధులుగాఁ జేయఁగలదు. కావున దైవభక్తిగలిగి మంచిగుణముల నవలంబించి తిన్నఁ గా నడుచుకొనుచుండినయెడల దైవానుగ్రహమువల్ల మనము బా గుపడుదుము. ఇతరులను బాగుచేయఁగలుగుదుము. దేశమును బా గుచేయఁగలుగుదుము. ఇంతకంటె వేఱెస్వర్గము, మోక్షమును గావలయునా? స్వర్గమును, మోక్షమును మాత్ర మెందుకు ? సు ఖపడుటకు. ఇంతకు

## సుఖమన నేమి?

దుఃఖము లేకుండుట. దుఃఖమన నేమి? మనస్సునొచ్చుట. మన స్సేలనొచ్చును? చెడుపనులుచేయుటవలన. చెడుపను లేల కలుగు ను? స్వేచ్ఛావిహారమువలన. స్వేచ్ఛావిహార మేలకలుగును? దైవభ

క్తి లేమివలన. దైవభక్తి యేల లేకపోవును? దూరాలోచనము లేమివలన. దూరాలోచన మేల లేకపోవును. పెద్దలశిక్షకు లోఁబడకుండుటవలన. కావునఁజిన్నతనమునుండియుఁ బెద్దలశిక్షకులోనై దూరాలోచనమును దైవభక్తియుఁ గలిగి స్వేచ్ఛావిహారము మాని, చెడుపనులుచేసి బాధనొందక మంచిగుణముల నవలంబించి తాను బాగుపడి, కష్టపడి యితరులను బాగుచేసి, పుట్టినందుకు నావిధి నేను జేసి నాజన్మము సార్థకము చేసికొనుచున్నాననను నిబ్బరము వలన మనస్సు తేలికగా నుండుటయే సుఖము.

శరీరమునలనఁ గలిగిన సుఖమొక సుఖముగాదు. అదివట్టి యెండమావి. దానినపేక్షించుట బుద్ధిమంతునికిఁదగదు. నిజమగు సుఖము మనకీలోకముననే లభింప వీలున్నప్పుడు పరలోకముమాట యెందుకు? కావున స్వర్గము మోక్షము కావలయునని తమ మేలుమాత్రమే చూచుకొనక బుద్ధిమంతులిచ్చటనే స్వర్గము మోక్షమునున్నవని యెంచి, పరులకు మేలుచేసి యందువలనఁ గలుగు సుఖము స్వర్గమోక్షముల సుఖములకంటె నెక్కువ సుఖమని తలఁచి పాటుపడుట మిక్కిలి మేలని నానమ్మకము. అట్టివారికిఁ బరోక్షమున నుండునో యుండవో యని యనుమానపడు స్వర్గమోక్షములతోఁ బనియేలేదు. కావున నామార్గ ముత్తమమని చెప్పఁదగు. ఒకవేళ నిజముగాఁ బరోక్షమున నుత్తమలోకములున్న, వాని యుండులేముల నెన్నక పరోపకారముకొఱకుఁ దమ జీవముల ధారవోయఁదలఁచుకొనినవారి ప్రవర్తనము వానికి సాధకమేకాని బాధకమెంతమాత్రమును గానేరదు. అంతియకాక వానియునికి పులగముమీఁది పప్పు. చూచితిరా? అయ్యలారా! దేవుఁడు లేఁడనుటవలన నెంతకీడున్నదో! దేవుఁడున్నాఁడనుటవ

లన నెంత మేలున్నదో! కావున దేవుఁడు లేఁడని కలనైనఁ దలంప
కుఁడు. అంతకంటె నెక్కువపాపము మఱియొకటి లేదు. దేవుఁ
డు లేఁడని తలఁచుటయే పాపమగునప్పు డావిధముగ ననుటయు, దా
నినిబట్టి యిచ్చవచ్చిన చెడుపనులు చేయుటయుఁ బాపములని వే
ఱుగాఁ జెప్పవలయునా? దేవునియునికిఁ గూర్చి రవంతయు సందే
హింపకుఁడు. ఆ పరమేశ్వరుం డెల్లప్పుడు నుండువాఁడు; ఉన్నాఁ
డు. ఆదయామయునియందు భారముంచి, దురభిమానముం జం
పుకొని, ఫలకర్తృత్వము మనది కాదని మేలుగలిగించుపని చేయుట
యే మనపని.

ఏమి సందేహించుచున్నారు? మఱేమియు లేదు. మీరు దేవుఁ
డున్నాఁడని చెప్పుట దూరముగా నాలోచింపఁగా మాకును యు
క్తియుక్తమని నాటుటచే మేము నొప్పుకొనినాము. సరియే కాని

## దేవుఁ డెట్టివాఁడు?

అయ్యలారా! దేవుఁడెట్టివాఁడని మన మెన్నఁగలమా? వా
క్కునకును మనస్సునకును దెలియరానివాఁడు. అతని గుణముల
కు లెక్కలేదు. కాన నెంత తెలివిగల మనుష్యుఁడును వానినన్నిం
టి గ్రహించి యెన్నఁజాలఁడు. ఎంత పెద్దయద్దమైనఁ బ్రపంచము
నంతటిని దనలోఁ గనఁబఱుపఁగలదా? అయినను జేతనగునంతవ
ఱకు సంగ్రహముగాఁ జెప్పఁ బ్రయత్నింతము. సర్వశక్తులుగలిగి, వి
లాసంబుగాఁ జరాచరంబగు ప్రపంచంబంతయు సృజించి, అంత
టనిండి, సమర్థుండై యంతయుభరించి రక్షించుచు, దోషరహి
తుండై, సకలసుగుణంబుల కాకరంబై, తన్నుఁదెలిసికొని కొలుచు
వారికిఁ దోడునీడయై వారి కేలోపంబు లేకుండఁ బోషించి కష్టం

బులనుండి గ్రాసైక్యంచుటయేకాక, తన్నుఁదెలిసికొనఁ జాలనివా రినిగూడఁ బోషించి రక్షించుచు, తన్నెదిరించిన వారిమీఁదఁగూడ మాత్సర్యంబులేక వాత్సల్యంబున వారి తెలివిలేమినిమన్నించి మంచితో్రోవకుఁ దీసికొనిరాఁజేయుచు, సర్వజ్ఞుండై యెల్లవారి చర్యలంగని పక్షపాతంబులేక వారిపనులంబట్టి సుఖదుఃఖములును, అధికారదాస్యంబులును గలిగించుచు, లోకచిత్రంబులం గనుచు, అన్నిరూపంబులుదానయై ప్రత్యేకముగా నొకరూపు లేక,ఆదిమధ్యాంతంబు లివియని యెఱుంగ నవకాశమీయక యెప్పుడు నొక్కచందంబునం బరమానందస్వరూపుండై యుండు సర్వలోకైకేశ్వరుండు దేవుండు.

సరియేకాని దేవునికిఁ బక్షపాతబుద్ధి లేనియెడల నందఱి నొక్కవిధముగాఁ బుట్టించి పెంపక కొందఱి ధనవంతులుగాను, కొందఱిని దరిద్రులుగాను బుట్టించి, కొందఱిని సుఖపెట్టి కొందఱిని గష్టపెట్టుట యేమనికదా మీ సందేహము? బాగుగనున్నది!

## దేవునకు పక్షపాతము!

మనుష్యుల స్థితిగతులయందుఁ గనంబడు భేదములకుఁ గారణము వారివారి కర్మమేకాని దేవుఁడు కాకపోవుటచే దేవునియందు మీరు లోపమారోపింపనేరరు. దేవునకు లోపమొక్కటియు లేదు. అయినఁ గర్మమేమియని కదా పైసందియము. ఆలకింపుఁడు. పూర్వజన్మములఁ జేసికొనిన మంచిచెడుపనుల ఫలమే కర్మము. అదియే యీజన్మమున నిట్టిభేదములఁ గలిగించుటకుఁ గారణము. మనుష్యులకొక్కజన్మమే యని చెప్పువారీభేదములకుఁ గారణమేమని చెప్పుదురు? దేవుఁడు పక్షపాతముగలవాఁడనియో

షమారోపించి యతని మహిమకు లోపము తెచ్చెదరా? మఱి యొకవిధముగాఁ జెప్పఁగలరా? ఏదియు లేదు. కావున మనుష్యున కొక్కటియే జన్మమనుటకు వలనుపడదు. అనేకజన్మము లున్నవను వారేమి చెప్పుదురనిన వినుఁడు. మొదటి జన్మమున దేవుఁడందఱి నొక్కవిధముగానే పుట్టించి యొక్కస్థితిలోనేయుంచి, చెడుత్రో వలఁబట్టి చెడక తిన్నఁగానడుచుకొని బాగుపడుఁడనియే నియమించినాఁడు. అతని యాజ్ఞానుసారముగా నడుచుకొనినవారు బాగుపడి యిప్పుడు మంచిస్థితిలోనికివచ్చి సుఖపడుచున్నారు; ముందు సుఖపడఁగలరు. అతని యాజ్ఞమీఱినవారు చెడిపోయి యిప్పుడుచెడుస్థితిలోనికివచ్చి కష్టపడుచున్నారు. ముందునుగష్టపడెదరు. కాఁబట్టి మనుష్యులస్థితిభేదమునకు వారికర్మమే కారణముగాని దేవుఁడుగాఁడు.

పందెములకు విడుచునప్పుడు తగవరిసరిగాఁ జూచియే పందెగాండ్రనువిడుచును. తరువాత ఫలము వారివారి నడతను బట్టియుండు. గెలువకపోయిన వానిలోపము వానిలోనె యుండును గాని తగవరిలోనుండునా? తగవరినెవ్వరైన నిందింపఁగలరా? అట్లైమనము మనదుస్థితికి మనలనే నిందించుకొనవలెఁగాని భగవంతుని నిందింపఁదగదు. పరాత్పరునిందించుట పాపము మూటగట్టుకొనుటయె. తగవరి గెలిచిన వానిమెచ్చుకొనును; కష్టపడి యోడినవానిఁ గనికరించును; కష్టపడక యోడినవాని నుపేక్షించును; విరుద్ధముగానడిచినవాని నిందించి దండించును. దేవుఁడు నట్లైచేసినఁ దప్పేమియులేదుగదా? అయిన నతఁడు విరుద్ధముగా నడిచిన వారినిగూడ మన్నించుటకేచూచును. అదియే యతనిగొప్ప. కావున దేవుఁడేవిధమునను నిందనీయుఁడు గాకపోవుటయే కాక యన్ని

విధముల వందనీయుఁడే. ఏమి? ఇంకను దేవునికిఁ బక్షపాతముగ
లదందురా? ఎప్పుడు నట్టి వెఱ్ఱితలఁపు తలఁపకుఁడు.

బాగుగ నేయున్నది కాని మనకొక దేవుఁడు కాఁడుగదా? ఎవని
కివందనంబు చేయుట? అని యందురు కాఁబోలును. మీ రీ ప్రశ్నయ
డుగుదురని నాకుఁ దెలియును. ఇదియే మీ తెలివితక్కువ. దూరా
లోచనము లేకపోవుట.

## మనకొక దేవుఁడు కాఁడా?

ఎవరు చెప్పినారు? ఎవరు చెప్పుటదియేమి? బ్రహ్మ, విష్ణువు, శి
వుఁడు మొదలగు పేర్లన్నియు నెట్లువచ్చినవి? అందురాయేమి? అ
వియన్నియు నధికారములంబట్టి దేవునకువచ్చిన బిరుదు పేర్లు. మ
నుష్యులలో నొక్కొక్కనికే యెన్నియో బిరుదులుండునపుడు స
ర్వేశ్వరునికి బిరుదులుండుటవింతయా? అయిన విగ్రహములు మొ
దలగునవి యేమనియా మీసందేహము. అవి యక్షరములుకుదురు
టకు గుంటయోనమాలవలెఁ బరమేశ్వరుపై దృష్టినిలుచుట కేర్పఱు
పఁబడిన సాధనములు. అక్షరములు కుదిరినగుంటయోనమాలతోఁ
బిల్లవాండ్ర కెట్లు పనియుండదో భక్తులకును దృష్టినిలకడ గలిగిన వి
గ్రహాదులతోనట్లె పనియుండదు. ఇట్టిసాధనముల యావశ్యకత మ
నుష్యులస్థితినిబట్టి వచ్చుచుండును. దీనినిబట్టి దేవుఁడొకఁడు కాఁడ
నియనుకొనుట వట్టి తెలివితక్కువ. ఇట్టి తెలివితక్కువచే మనమ
తము మంచిదిగాదని మఱియొకమతము నవలంబింతమని చూచు
వారికంటెఁ దెలివితక్కువవాండ్రు మఱియొక్కరుండరని నొక్కి
చెప్పవచ్చును. దేవునిసంగతి కొంచెమైనను దెలిసినవాఁడిట్టి వె
ఱ్ఱిపని కలనైనఁ జేయఁడు. ప్రతిమతమునందును మనుష్యులస్థితినిబ
ట్టి భేదములుండునుగాన వానిసంగతి తెలిసినవారొకమతమునుం

డి రెండవదానిలోని కెప్పుడును వెళ్లరు; వెళ్లవలసినపనిలేదు. అట్టి చోఁ దనమతమునువిడిచి మఱియొకదానిలోనికి వెళ్లుట వెళ్లినవా ని తెలివిలేమిని వెల్లడిచేయు. తమమతము నవలంబింపనివారిని దే వుఁడు రక్షింపఁడనుటయు నట్టిదే. అయిన దేవుఁడంతపక్షపాతము కలవాఁడా? కాఁడు, ముమ్మాటికి దేవుఁడు పక్షపాతము కలవాఁ డు కాఁడు. తెలియమిచేఁ దెలివితక్కువవాండ్రు తమపక్షపాత ము నతనియందారోపించినను బుగ్గిమొదలగు కల్మష పదార్థముల చేఁ గల్మషునిగాఁ జేయఁజూచిన నటుగాని సూర్యునివలె నతఁడు ను నిష్కల్మషుఁడై యుండునుగాని తనయందు లేనిలోపము లా రోపించినటువంటివాఁడు కానేరఁడు. అతఁడు తన్నేవ రేరూపము న నమ్మికొల్చిన వారి నారూపముననే కాపాడుచుండు కరుణాక రుండుగాని యెవరో చెప్పిన యొకరూపముననే కొలువకున్న వి డుచు పక్షపాతికాఁడు. నమ్మకము ప్రధానముకాని వేఱొకటికా దు. నిజముగ నెవరు నతనిరూప మిట్టిదేయని చెప్పఁజాలరు. ఆయ నమహిమ, దానిని దెలిసికొనవలయునను నిశ్చయముతోఁ దమజీ వముల ధారవోసిన మహాత్ములకే యవాఙ్మానస గోచరమనిన నిఁ కఁబెఱవారిమాట చెప్ప నేల?

అట్టిదేవునికి వందనము చేయుటతప్పా? కాదు; ఒప్పే. సం ధ్యావందనమా దేవునిగూర్చి చేయునట్టివందనమేకదా. అందుచే త సంధ్యావందన మన్నివిధములచేతఁ గావలసినదనియే తేలిన దిగాని యక్కఱలేనిదని తేలలేదు. కాఁబట్టి మనుష్యులందఱు ను సంధ్యావందనము చేయవలయును. అదియే మనుష్యుల బాగు చేయు ముఖ్యసాధనము. అది చేసిన వారెప్పటి పాపముల నప్పు డు పోఁగొట్టుకొని పరిశుద్ధులై సుఖింతురు. చేయనిచోఁ బాపముల

కుప్పలై చెడిపోయి కష్టములపాలయి దుఃఖింతురు. కావునఁ బోఁగొట్టికొన్నకాలమును బోఁగొట్టికొన్న నిఁకక్షణమైన వ్యర్థపుచ్చక సంధ్యావందనకల్పవృక్షము నాశ్రయించి, మీరుబాగుపడి, పైవారినిబాగుచేసి, దేశమునుబాగుచేసి, దేవునికిఁబ్రియులయి, సంసారతాపంబుఁబాపుకొని, శాశ్వతసుఖంబొసంగు ఫలంబు ననుభవింపుఁడు.

ఇప్పటికి మీకీయఁదలఁచుకొనిన హితోపదేశమయినది.

ఇఁక ముందు మీరుచేయవలసిన దేమి?

సీ॥ (౧) దేవుండు గలఁడని స్థిరముగా నమ్ముఁడు;
(౨) పెద్దలమాటల విని నడువుఁడు;
(౩) మిము బాగుచేయఁజాత్మైకసాధనమగు సం
ధ్యావందన మెపుడుఁ దగసలుపుఁడు;
(౪) పాడలవాట్లలవాటుపడ్డ విడుండు;
(౫) మంచివానలవాట్లమర్చుకొనుఁడు;
(౬) చెడుగుణంబులునున్న శీఘ్రంబవదలుఁడు;
(౭) మంచిగుణంబులఁ బెంచుకొనుఁడు;
గీ॥ (౮) మీరు బాగుపడుండు; (౯) ఆమీఁదఁ బరుల
బాగుచేయుట కెచ్చుగాఁ బాటుపడుఁడు;
(౧౦) దేశమును బాగుచేయుఁడు; (౧౧) దేవునకుఁ బ్రి
యతములరగుఁడు; (౧౨) మీరుకృతార్థులగుఁడు॥



శ్రీ:

# మానవవిధి.

గీ॥ మంచి చెడ్డలు గనువాఁడె మానవుండు;
బ్రతికి యున్నంతవఱకును వదలకుండ
మనసుతోఁ జేయఁ గావలసిన పని విధి;
మానవులొనర్పఁ దగువిధి మానవవిధి॥

మానవవిధి యననేమి? మనుష్యులు తప్పక చేయవలసిన పనియే మానవవిధి. మనుష్యులన స్త్రీపురుషులుగాని పురుషులుమాత్రమే కారు. అదియేది? తాను మొదట బాగుపడి, చేతనగు నంతవఱకితరులను బాగుచేసి, దేశమును బాగుచేసి తనపుట్టుక సఫలముచేసికొనుటయే. ఇందుచే మానవవిధి త్రిభాగమని తెలివది. మొదటిది తాను బాగుపడుట, రెండవది యితరుల బాగుచేయుట, మూడవది దేశమును బాగుచేయుట. తాను బాగుపడినఁగాని యితరులను బాగుచేయుటకును, దేశమును బాగుచేయుటకుం దగిన శక్తి కలుగదుగావున మొదటిదియె మొదట సాధింపవలసినది. కాని,-

## తాను బాగుపడుటయెట్లు?

కొందఱియందు హెచ్చు, కొందఱియందుఁ దక్కువయను భేదమేకాని లోపములులేనివారు లోకమునఁ గడునరిది. అట్లగుటచే మొత్తముమీఁద నందఱు లోపములుగలవారే. కాఁబట్టి బాగుపడవలయునను కోరికగలవాఁడు మొదటఁదనలోపముల దానుగనుఁ

గాని వానిని రూపుమాపఁ బ్రయత్నింపవలయు. సంధ్యావందనము నవలంబింపవలయును. విడని పట్టుదలతోఁ బ్రయత్నించిన యెడల సాధారణలోపములు సులభముగాఁ బోఁగొట్టుకొనవచ్చును. లోపములు రెండువిధములు- దుర్గుణములు, దురభ్యాసములు. దుర్గుణములకంటె దురభ్యాసములు సులభముగవదలును. కావున మొదటఁ దనకున్నపాడలవాట్లను, వానితోడనే చెడుగుణములను వదలించుకొనఁ జూడవలయును. దురభ్యాసములు సాధారణముగా దుర్జనస్నేహమువలనఁ గలుగును. కానఁ దాను బాగుపడవలెనను బుద్ధిపుట్టి మనస్సున నాటినతోడనే చెడుసహవాసము మానుకొనవలయును. అది మానినతోడనే దానివలనఁ దనకుఁ బట్టువడిన దురభ్యాసములను సాధ్యమగునంత త్వరలోవిడువవలయును. ఇది సులభముగా నెఱవేఱుటకు మనస్సు ముఖ్యముకావున నామనస్సును జేతనగునంత దిట్టపఱుచుకొనవలయును. మనస్సెంత దిట్టముగా నుండునో దురభ్యాసములును దుర్గుణములు నంతవేగముగా నిర్మూలములగును గనుక దానిపట్టువదలఁగూడదు. ఇట్లు గట్టిపట్టుతోఁ దనలోపముల మాపుకొనఁ బూనికొని యవి పెరుఁగుట కునికిపట్లగు దుర్జనస్నేహమును, మఱుఁగుస్థలములను జేరుటమాని, వానికిఁ జుక్కయెదురని చెప్పఁదగిన సజ్జనసన్నిధిఁజేరిన సూర్యచంద్రుల యెదుటఁ దలచూపఁజాలని చీఁకటులవలె నవియును దలయెత్తుటకవకాశములేక మురుగుడుమున్నెండఁగా దానితోడనే నశించు పురుగులచందంబున రూపుమాయు. దురభ్యాసములు పోయిన దుర్గుణములును వానిదారినేపట్టును. తరువాత నిట్టిప్రయత్నము చేయువానికి దైవముతోడై తనదయారసంబు వానిపైఁగురియు. సజ్జనులగు పెద్దలసహాయంబున సుగుణంబు లొకటియొకటి తనమనం

బున నాటి పెరిఁగి యావరించునటుల చేసిన, సంపెంగతోఁటకుం దుమ్మెదలు చేరనితీరునఁ జెడుగుణంబులు చేరకయుండు. తానిటుల తన దురభ్యాసంబులను దుర్గుణంబులను నిర్మూలంబొనరించి, లోపంబులేవియులేవను నిబ్బరముగలిగి, మంచియలవాట్లును మంచిగుణములును దనయందు నాటుకొని పెరిఁగి ఫలించు స్థితిలోనికివచ్చినపుడు తానితరుల బాగుచేయుటకుఁ బూనుకొనఁదగినవాఁడగును; కానఁ దాను పైనిజెప్పినదశకు వచ్చెనను నిబ్బరముఁగలవాఁడు రెండవమెట్టనఁదగు పైవారిబాగుచేయుటకు మొదలుపెట్టఁదగును.

## పైవారిని బాగుచేయుటయెట్లు?

జన్మమెత్తినందులకుఁ దనమేలుదాను జూచుకొనుటయే ఫలము కాదు కానఁ జేతనగునంతవఱకుఁ దనతోడివారికి సహాయపడి బాగుచేయఁ బూనుకొనుట బుద్ధిమంతుని లక్షణము; కావునఁ దాను దనలోపముల నేప్రకారము పోఁగొట్టుకొనినాఁడో పైవారిలోపములను సాధ్యమగునంతవఱకుఁ గష్టపడి నయమువలయుచో నయమును భయమువలయుచో భయమును నుపయోగపఱిచి పోవునటులచేసి, మంచియలవాట్లును మంచిగుణములను వారికిఁ బట్టుపడునట్లొనరించి, తనవలెనెవారును బైవారిని బాగుచేయుటకుఁ దగినస్థితిలోనికి వచ్చునట్లు చేయవలెను. అటుల తనచే బాగుపడినవారు తాను బూనుకొనిన మంచికార్యములయందుఁ దోడ్పడుదురు. అందుచే దేశమును బాగుచేయుటకు వీలగు.

## దేశమును బాగుచేయుటయెట్లు?

పైనిజెప్పినరీతిని సాధ్యమగునంతవఱకుఁ దమయందులోపము

లు లేకుండఁ జేసికొని, సద్గుణంబుల దినదినంబు నభివృద్ధి నొందిం
చుకొనుచు, తమ మేలు చూచుకొనుట ముఖ్యముగాదని యెఱింగి,
వీలగునంతవఱకుఁ దోడివారికి సహాయపడి మంచిదారికిఁ దెచ్చి,
తెచ్చుచు, తమదారి నవలంబించిన వారితోడ్పాటుతోఁ తమదే
శంబునంగల లోపంబులఁ గనుంగొని, తాము మొదటఁ దమలో
పంబులఁ బోఁగొట్టికొనినకైవడి దానిలోపంబులం దగుసాధనం
బులఁ దీర్చుటకుఁ బూనుకొని, కష్టంబునకు వెనుకదీయక సాధ్య
మగునంత త్వరలో వానింబాపి, పిమ్మట దానియభివృద్ధికిఁగారణం
బులగు సాధనంబులమర్చి, తాము తమసద్గుణంబులఁబెంచుకొను
నట్లు వానిబెంచుచుండిన దేశంబు బాగుపడి, తానును బరదేశము
ల యపేక్షతనకులేక తానె పరదేశంబులకుఁ దోడ్పడు స్థితిలోని
కివచ్చు. దేశము నిట్టిస్థితిలోనికిఁ దెచ్చుటయే దేశమును బాగుచేయు
ట. తమదేశము నభివృద్ధిలోనికిఁ దెచ్చుటకంటె నందుఁబుట్టినవా
రికి నెక్కుడుమంచిపనియున్నదా? మానవులై పుట్టినవారికి స్వదే
శాభిమానమువలదా? తమ్ముఁబెంచి పెద్దవారినిజేయు తమదేశ
మునకుఁ దాము దోడ్పడకుండుట కృతఘ్నతగాదా? కృతఘ్నత
కంటె నెక్కుడుపాపముగలదా? పాపఫలమనుభవింపక యూ
రకపోవునా? తమ్ముఁ బాలుపెరుఁగులిచ్చి పెంచునావును దాము
బాగుచేయకున్నఁ గొలఁదికాలములోనె యది చిక్కి, తానుబా
డయి తమకుఁ బనికిరాకుండఁబోదా? దేశము మాత్ర మట్టిదికా
దా? కావునఁ గాలక్షేప మగుచున్నది గదా యని యేమఱియుం
డి యొగఁదన్నినతరువాత నోరు తెఱచుకొని చూడక, ముందే తెలి
వి తెచ్చుకొని దానిని బాగుచేసికొనుటకుఁ బూనుకొనవలయును.
దేశ మొకనిచే బాగుపడునది కాదు. దానికిఁ బలువురుగలిసి పాటు

పడవలయు. పలువురుగలిసి పనిచేయుటకు మనసులొకటి కావల యు. మనసులొకటియగుటకు మంచిగుణములుండవలయును. మంచిగుణము లలవడుటకు సజ్జనసాంగత్యము ముఖ్యము. సజ్జనసాంగత్యము తాను బాగుపడవలయునను గట్టి నిశ్చయము చేసికొనిన వాఁడేకోరు. కాఁబట్టి మనుష్యులనిపించుకొనువారందఱును మొదటఁ దాముబాగుపడి, సాధ్యమగునంతవఱకుఁ జైవారిని బాగుచేసి, అందఱుంగలిసి దేశమును బాగుచేసి, తమజన్మమును సార్థకముగాఁ జేసికొనుటకుఁ బ్రయత్నింపవలయును.

ఇందువలన మీరు మతస్సున నెప్పుడు గుఱిగా నుంచుకొనవలసిన సంగతి యేమి?

గీ॥ తాను మొదట బాగుపడి, యితరులబాగు
చేసి, తనదేశమును బాగుచేయ సరిగఁ
బూనుకొని పనిచేయుట మానవవిధి;
అరసి, దీనిని జేసి కృతార్థులగుఁడు॥

## తమవిధి చేయుక్రమము.

గీ॥ ఈశ్వరుఁడు గాక సర్వజ్ఞుఁ డెవఁడుఁగాఁడు
కాన దురభిమానంబును మాని లోప
ములు మనకుఁగల్గు నని వాని మొదటవదలు
కొనుదమని నిశ్చయ మొనర్చుకొనవలయును॥

గీ॥ అట్టినిశ్చయమున సంధ్యలందు దినముఁ
బరునికిన్ వందనము చేయవలయు; దానఁ

గొన్నిదినములలోననే కొలఁదిలోప
ములు తలలుమాడి యంత నిర్మూలములగు॥

గీ॥ వదలకటు చేయుచుండినఁ బిడపఁ బెద్ద
లోపములు కూడఁ గ్రమముగా రూపుమాయు;
అంతటఁ బరాత్పరుండు దయారసంబు
కురిసి మదిపొలమును సమకూర్చుఁబనికి॥

గీ॥ అందు సుగుణంబులను నాటి యనుదినంబు
మెలఁకువుగఁ బెంచుచుండినఁ గొలఁదికాల
ముననె యవిపండు; ఆఫలములనుదినుటె
మనము నిజమగు సుఖమును గనఁబోడఁగుట॥

గీ॥ అంతతోఁ దృప్తిఁజెందక సంతసమునఁ
బాటుపడుచున్న నెప్పుడు ఫలములంద
వచ్చు; కానియవన్నియుఁ బరుల కిడక
తానుమాత్రము తినుటకె తలఁపఁదగదు॥

గీ॥ మొదటఁ దనమేలు గనుటయే ముఖ్యమైన
నదియయినపిమ్మటను మాత్రమట్లుగాదు;
తానుమేలుగను ఫల మితరులమేలు
గనుటయేకాన నదియెముఖ్యంబునగును॥

గీ॥ అందుచేఁ దాను దనచేతనయిన వఱకుఁ
దాఁ దినుఫలంబు పరులకుఁ దాన్పవలయు;
అంతియేకాదు; అవసరమైన యెడలఁ
దానుమానియు నిచ్చుట తగుమగఁటిమి॥

గీ॥ అటుల పైవారిమేలు తా నరయుచున్న;
వారుబాగుపడి పరుల బాగుచేయు

వారలగుదురు; అప్పుడు వారు తమకుఁ
దోడుపడుటొకవింతయా? తోడ్పడుదురు॥

గీ॥ అయిన వారితోడ్పా టెందుకని యనకుఁడు;
కావలె; ఎవరి మేల్వారు గనుటతోనె
తమవిధిముగియ లేదు; పెద్దపనిముందు
గలదు; దానికి సందఱుఁ గలియవలయు॥

గీ॥ సరియె; ఆపని యేమి? దేశంబు బాగు;
అది యొనర్పుట యొకనిచే నగునె? దాని
కొండొరులతోడు తప్పక యుండవలయు;
కలిసి యొకమదితోఁ బని సలుపవలయు॥

గీ॥ అటులు పని యొనరించి దేశాభివృద్ధి
చేయువారలె తమవిధి చేయువారు;
మానవులమనుకొన నర్హులైనవారు;
ఒడలు విడిచిన బ్రతికియే యుండువారు॥

గీ॥ అయ్యలార! మీ రట్టి వారగుట తగదె?
లెండు; మీవిధిఁ దెలిసికొనుండు; మీరు
బాగుపడుఁడు; దేశంబును బాగుచేయుఁ
డరసి దీనిని జేసి కృతార్థులగుఁడు॥



శ్రీ.

# మానవవిధి.

## సంవాదము.

[ఇద్దఱువిద్యార్థులు విహారమునకు వెళ్లివచ్చుచుందురు.]

మొ. వి—[విచారముతో] చా! మనము కాలమంతయు వ్యర్థముగాఁ బాడుచేయుచున్నామురా. మనుష్యులమైపుట్టిన లాభమేమి?

గీ॥ ఎందులకుఁ బుట్టినారమో యెఱుగకుండఁ
తినితిరిగి తెల్వి మాలిన పనులుచేసి
యెప్పుడో చావ నీజన్మమెత్తుకంటెఁ
బశువులుగఁ బుట్టియుండిన బాగుగాదె?॥

రెం. వి—ఏమి? ఈలాగు మొదలుపెట్టినావు? రేపు లోవతోఁటకు రావా యేమి?

మొ. వి—ఓరీ! నీకిప్పటికిబుద్ధిరాలేదా? కొంతవఱకుఁ దెలియక, కొంతవఱకుఁ దెలిసి యేవో తెలివితక్కువపనులు చేసినాము; అయిపోయినది. చచ్చునంతవఱకదియే దారియా? దీనిలో నేమున్నదో చూచినావా? (ఒక కాగితమువిప్పి)

చూడు. "గీ॥ ఎందులకుఁ బుట్టినామని యెంచుకొనుఁడు;
తిని తిరిగి చచ్చుకొఱకుఁ గాదని యెఱుఁగుఁడు;

వేగమవివేకపుంగన్ను విప్పి కనుఁడు;
అరసి మీవిధిచేసి కృతార్థులగుఁడు॥
గీ॥ పక్షిణంబునఁ జత్తుమో యెఱుఁగలేని
యట్టిదిగదా మనతెలివి! అయ్యలార!
దీని కాకన్నుగానక తిరిగి చెడుట;
క్షణముగోల్పోక మీవిధి సలుపుకొనుఁడు॥"
ఏమి? ఇప్పుడేమనియెదవు?
రెం. వి— ఏమనవలె? (నగుచు) ఇది చూచియా నీకింతవైరా
గ్యముపుట్టినది. అయినసరియే. ఇంటికివెళ్లి భోజనము చే
యువఱకే యీబుద్ధి.
మొ. వి— ఆలాగుననే యనుకొమ్ముగాని నీబుద్ధియేమియు మా
ఱలేదా?
రెం. వి— ఎందుకుమాఱవలె? సుఖముననున్న ప్రాణమును గష్ట
పెట్టుకొనుటకా?
మొ. వి— ఊఁ. ఆలాగా? సరియేకాని
గీ॥ ఎఱుఁగకడిగెద సుఖమన నేమొ చెపుమ?
రెం.వి.— బాగుగఁదినుట; ఇష్టులౌ వారితోడఁ
గూడి తిరుగుచు నాడుచుఁ బాడుకొంచుఁ
గాలమును గడుపుటయె సుఖంబుసుమ్ము॥
మొ. వి— ఇదియానీసుఖము?
రెం. వి—నాసుఖమే కాదు; అందఱిసుఖమునిదియె. ఇంతకంటె
నీసుఖము మఱియొకటియున్నదా యేమి?
మొ.వి—నాదే కాదుగాని, యిప్పుడు నేనెఱిఁగినదొకటియున్నది.
రెం. వి—ఏమది? చెప్పు, చూతము.

మొ వి—విను.

"గీ॥ స్వేచ్ఛసుఖమన నేదన- జన్మ మెత్తి
వందులకు నేను నావిధినాచరించి
దాని సఫలంబు చేయుచున్నానని మది
నిబ్బరంబునఁ దేలుచు నెగడుచుంట;
కాని, కానిది తిని త్రాఁగి కానివారిఁ
గూడి కాని పనుల్ చేసి కులుకుచుఁదము
మొదలు తమకుఁగూడఁ దెలియకుంట కాదు
కాదు వేమాఱులకు నైనఁ గాదు కాదు॥"

రెం. వి—ఎక్కడిదిది? నాకేమిబోధపడకున్నది. విధి యేమిటి?

మొ. వి— అది తెలిసిననిదియు నప్పుడే తెలిసియుండును. కాని యొకమాట. మనుష్యులమై పుట్టినందుల కేమి చేయవలయునసియెదవు?

రెం. వి— ఏమి చేయవలె? చక్కఁగాఁదినవలె, తిరుగవలె, హాయిగాఁగాలముగడుపవలె. అంతకంటెమఱియేమియున్నది?

మొ. వి— అంతే, మఱేమియు లేదు! అయినఁదినుటకేమైన గడించుకొనవలెనా? అదియునక్కఱలేదా?

రెం. వి— పెద్దలు గడించినది యేమగును? లేకున్న గడించుకొనెదరు.

మొ. వి—గడించుకొనుటకు దారియేదైనఁగావలయునా? ఎక్కడనైన దొరకునా?

రెం. వి—ఒక దారియేమి? కావలసినన్ని దారులున్నవి- చదువుకొను వారు చదువుకొని యుద్యోగములు చేయుదురు; చదువుకొనని వారు వారికిఁ దగినమఱియేపనియో చేసికొందురు.

మో. వి— సరియే. ఏదీ, నీమానవవిధి?

రం. వి— ఏమియున్నది?

గీ॥ ధనముగలవారు స్వేచ్ఛగాఁడని తిరుగుచు
లేనివారు చదువుకొనియేని మఱియొ
కవిధముననేని పనిచేసి కడుపునింపు
కొనుచుఁ గాలమును గడుపుకొను టెసుమ్ము॥

మో. వి— నీమానవవిధి యదియే కాని సరియైన దది కాదు.

గీ॥ పుట్టినందుకుఁ దినుటయా ముఖ్యఫలము?

రం. వి— అవును; తినకున్న సుఖమెటులబ్బు? సుఖము
పడకయున్నను బ్రతికిన ఫలమిఁకేమి?

మో. వి— మనము బ్రతుకుటకు ఫలంబు తినుటగాదు.

రం. వి— అయినఁ దినుట మొదలయినయవి వలవదె?

మో. వి— వలయును శరీరపుష్టికి వలయువఱకు.

రం. వి— వానికిధనంబు గడియింపవలదె?

మో. వి— ధనము
న్యాయమార్గంబునం దెంతయైనఁగూర్ప
వలయుఁ బైవారికై వ్యయపఱుపవలయు;
వలసినది తాను వాడుకోవచ్చు; కాని
తనకొఱకుమాత్రమే కూర్పఁదగదు; నిజము.

రం. వి— ధనము గడియింపఁ జదువుకోఁదగదె?

మో. వి— తనదు
జ్ఞానవృద్ధిని జేసికో, న్యాయమునధ
నమ్ము గడియించి సరిగ వ్యయమ్ము చేయు
కొఱకయినఁ దగు; కానియా గుణమె లేక

తనసుఖంబుల కనుగొనను ధనముకొఱకె
నైన రవ్వంతయుఁదగదు; దానిపరువు
తీసివేయుటయెకద యీ తెలుఁగు; కానఁ
దుచ్ఛసుఖములకు ధనంబు దోఁచుకొనెడు
తలఁపునన్నైనఁ జనువుకోఁదగదుతగదు.

రెం. వి— తనసుఖంబున కేదియుఁ దగనియెడల
నీశరీరము గల ఫలమేమి చెపుము?

మొ. వి— తనవిధి యొనర్చుకొని శాశ్వతసుఖముగనఁ;
సుఖమనిన నీవు చెప్పిన సుఖముకాదు.

రెం. వి— అయిన మనవిధి యేమని యనెదవీవు?

మొ. వి— మనము మొదట బాగుపడియు వెనుకఁ బరుల
బాగుచేసి దేశంబును బాగుచేయు
నీమమును బూని పనిచేయుటే మనవిధి॥

రెం. వి— అబ్బ!

గీ॥ కష్టమిది, చాలకష్టము!

మొ. వి— కష్టమ? ఊఁహుఁ;
కష్టమక్కఱలేక సుఖము కలుగునె?

రెం. వి— ఏమి? కలుగకపోవుట యేమి? కష్ట
మెట్టిదో యెఱుంగకుండ నేనెందఱో సుఖ
పడుచునుండఁగన మె!

మొ. వి— అది వట్టిభ్రమయె.
కష్టపడకుండ వచ్చు సుఖంబులేదు;
కష్టమెఱుఁగకయున్న సుఖము తెలియదు;

కానఁ గష్టములేని సుఖంబుసున్న.

రెం. వి— కష్టపడుదుము, మంచిదే; కాని, కష్ట
పడిన మనమె దేశంబును బాగు చేయఁ
గలమె?

మొ. వి— సందియమేమి? లోకమున నిపుడు
బాగుపడిన దేశంబుల వారలిట్టి
సందియంబునఁ దమవిధి సలుపకున్న
నవియు నడుగంటియుండవే? అదితలంచి,
సందియముమాని వారలేచందముననుఁ
గష్టపడినారొ మనమటు కష్టపడినఁ
బరుని దయ మనదేశంబును బాగు చేయఁ
గలుగుదుము; నిజమదె జన్మఫలము సుమ్ము.
పరులు తమదేశమును దాము బాగు చేసి
కొనుట కనులారఁగాంచుచు మనముకష్ట
మనుచు మొదలెడానికిఁ బూనుకొనకపసుల
వలెఁదినుచుఁ దిరుగుచు మఱివానికంటెఁ
దక్కువగఁగూడనడుచుచుఁ దగుదుమనుచు
మనజులమటంచుఁ జెప్పుకోఁ జను నె? ఇదియె
తాముచెడుట, పైవారలఁ దమవిధమునఁ
జెఱుపుట, తమదేశంబును జెఱుపుట; ఇటు
వంటిపుట్టుకగనకున్న బాగు; కానఁ
గష్టమని యెప్పుడుం బలుకంగఁదగదు;
బాగుకోరినచోఁ గష్టపడవలయును;
కష్టపడువాఁడె సుఖమును గాంచఁగలుగు;

కష్టమనిజంకువాఁడెప్డు కష్టపడఁడు;
కష్టమునకు జంకమియె మగతనముసుమి;
కాననిఁక మగవారముగాఁ దలఁచిన,
మనము బాగుపడుటకుఁ గోరిన, ఇతరుల
బాగుచేయ, దేశంబును బాగుచేయఁ
దలఁచినను గష్టమనుమాట తలఁపఁదగదు.

రెం. వి— అటులచెప్పెదవేకాని యాలకింపు
మొకట—మాట- చిన్నప్పటినుండి మొదలు
వంచి కష్టపడక యిచ్చవచ్చినటుల
తిని తిరుగుచున్నవారము మనమిపుడొక
మాఱుమంచివారలముగా మాఱి కష్ట
పడి పరులను దేశముఁగూడ బాగుచేయఁ
గలుగుదుమనుకొనుట వెఱ్ఱిగాదెచెప్పుము?

మొ. వి— కాదు మగతనముండినఁ గాదు కాదు.

రెం. వి— మగతనమననేమి?

మొ. వి— వినుము—తగనిదియని
తెలిసినది మాని, తగునని తెలిసినయది
యెంతకష్టంబుపడనున్న నించుకేని
భయపడక చేయఁజాలు నిబ్బరముసుమ్ము.

రెం. వి— అయిన నిదిమాత్రముండునా యందఱకును?

మొ. వి— ఉండదనుమాట కనఁబడుచున్నదైన
నుండవలె మగవారికి నుండవలయు;
మగతనము గల్గువారలె మనుజులుసుమి.

రెం. వి— ఐన మనమింతవఱకును మానవులము

కాదె?

మొ. వి— పేరు నకగుడుము.

రెం. వి— (తలయూఁచి) ఏ మొనర్పఁ
దలఁచితిఁక?

మొ. వి— మానవుడనుగాఁ దలఁచినాఁడ.
నీదు నిశ్చయ మేమిటి?

రెం. వి— నిజము దెలుప
నాకు మానవుఁడనుగా మనంబుగలదు
కాని కాఁగలనాయని కలుగుజంకు;

మొ. వి— యత్న మొనరింపఁ గాని దెయ్యదియు లేదు
కాన సందేహ మొందక కడఁగుదమిఁక;
సరిగనడిచిన మనకునీశ్వరుఁడుతోడు
పనుసు; పరమేశుతోడ్పాటు పడయు నెడలఁ
గాని కార్యంబుగలదె జగంబునందు?

రెం. వి— సరియె, నేనును నీవలె నలుపువాఁడఁ
గాని మనము మొదటచేయఁగావలసిన
దేమి?

మొ. వి— ఏమున్నది? మనము నీమముగను
మనవిధి యొనర్చుకొని వేగ మనుజులగుదెం;
దాని క్రమమంతయుఁగలదు 'మానవవిధి';
అది చదివి దానిఁబట్టిచే యంగవలయు.

రెం. వి— సరియె, యిఁక దానిఁబట్టియే సలిపి జన్మ
మును సఫలముగఁ గావించుకొనుదము పద॥

(నిష్క్రమింతురు.)

---

శ్రీ:

మానవవిధి.

# తెలుఁగు సంధ్యావందనము.

## మేలుకొనినతోడనే చేయవలసిన వందనము.

గీ॥ పగటిపూఁటఁ గష్టపడి బడలిక రాత్రి
యొడలు మఱచి నిద్ర నొందునపుడు
కంటిఱెప్పవోలెఁ గరుణననుం గాచి
నందుకిదిగో దేవ! వందనంబు॥

గీ॥ చంద్రునకునూలు పోఁగను చందమునను
నీకువందనమిడుకంటె నేనొనర్పఁ
గలుగు ప్రత్యుపకారంబు గలదె? కాన
నిందుకానంద మొందు మానందరూప!॥

చ॥ సరియిఁకఁ దెల్లవాఱినది; సాగకపోదు శరీరయాత్ర; ఎం
దరసిన నన్నికష్టములె; అక్కట! వానినిదాఁటు టెట్టులో?
కరముభయంబుగల్గు నటు గానదయాకర! తోడునీడవై
దురితముపాలుగానిగతిఁ దోడ్కొనిపోఁగదే నీకు మ్రొక్కెదన్॥

ఇట్లు భగవంతునియందే మనస్సునిలిపి ప్రార్థించి లేచి దేహబాధలుతీర్చుకొని వీలగువారు స్నానముచేసి ఈక్రిందిప్రాతస్సంధ్యావందనము చేయవలయును. ఏపనికిఁగాని మనస్సుప్రధానము గావున మనస్సునిలకడగా నుండునట్లు చేసికొనుటకు ముఖ్యముగాఁ బ్రయత్నము చేయుచుండవలయును.

# ప్రాతస్సంధ్యావందనము.

### ప్రతిజ్ఞ.

గీ॥ స్నానమున మేను శుభ్రమై నట్టి మనస్సు
నటుల కాఁజాలదందుచే నఖిలపాప
హరుఁడయిన హరి ధ్యానంబు నాచరించి
వెలిని లోపల శుచిగ నొప్పెదనుగాక॥

### తొలివందనము.

గీ॥ దేవదేవ! నారాయణ! దీనపాల!
వాసుదేవ! అధోక్షజా! దాసలోల!
సర్వలోకేశ! అచ్యుతా! సర్వశక్తి!
పాపనాశన! నీకిదే వందనంబు॥

(వీలగునపుడు మొదటిపాదమునందలి మూఁడు పదములనుచ్చ
నాచమింపవలయు.)

సీ॥ జగములఁబుట్టించి సంరక్షణ మొనర్చి
సమయించి మరలించు సర్వశక్తి!
అంతటనుండి లేనట్టులె యనుకొన
వచ్చునట్లుండు సర్వాంతరగతి!
అంతయుఁగనుచుండి యరయనేరును గనఁ
జాలని యటులుండు సర్వసాక్షి!
అన్నిరూపములు నీవగుట నేదోరూపె
నీవనియనరాని నిఖిలరూప!
నీమశక్తులు వర్ణింప, నిన్నుఁదెలియ,

నిన్నుఁగనుఁగొన, నీరూపమెన్నఁ జాల;
ఓపరాత్పర! సర్వజ్ఞ! ఓమహేశ!
అందుకొను భక్తి నేఁజేయు వందనంబు॥

సీ॥ మొదలు నడుమ తుది యిదియని చెప్పలే
కనువీని యాదిమధ్యాంతరహిత!
అన్నిపనుల్ చేయు చున్న వానికిఁగర్త
నీవనియనఁని నిర్వికార!
సర్వాత్మకుఁడవయ్యు సౌఖ్యదుఃఖంబుల
నొందక వెలయు నానందరూప!
ఎవ్వరేరూపున నెంచికొల్చినవారి
యభిమతమిచ్చు దయాసముద్ర!
నీదు తత్వంబుఁగని యెన్న నేర; నాదు
తెలివిలేమిని మన్నించి, తెలివినిచ్చి
మంచిదారిని బట్టించి, మనుపు దేవ!
డెందమునఁగొల్చి చేసెద వందనంబు॥

గీ॥ దేవదేవ!—అను పద్యముమరలఁ జదివి యాచమించి నమస్కరించి.

ఇంద్రియ నిరాకరణము.

గీ॥ క్రొత్తగుఱ్ఱాలలోఁబడఁ గొట్టి తిన్నఁ
గానడుపఁజాలు సారథి కరణి నేను
నెప్పటికిఁ గ్రొత్తగానుండు నింద్రియములఁ
గుదురుగానిల్పి నడుపఁ జాలెదనుగాక॥

గీ॥ దారివిడనాడి బండియుఁ దామఁగూలి
బండివానిని గూల్చి దెబ్బలుతినియెడి

తెలివి మాలిన గుఱ్ఱాల తీరు గాక
యనువుగానుండుఁడీ యింద్రియంబులార!
దేవదేవ-అనుపద్యము మరలఁజదివి నాచమించి నమస్కరించి.

దీక్ష.

గీ॥ ఈశ! నీయాజ్ఞజరిగెడు నీప్రపంచ
మందు భారతఖండంబునందు నేఁడు
నాదుపాపంబుఁ దీర్చుకొనన్సలిపెద
భక్తినినుఁగూర్చి ప్రొద్దుటి వందనంబు॥

పాపమార్జనము.

క॥ నారాయణ! నీనామో
చ్చారణమున శుద్ధమగుచుఁ జను నీనీటన్
దూరముగాఁ దోలుము నా
ఘోరపుఁబాపముల, నిన్నుఁ గొల్చెదమదిలో॥

[పైపద్యముచదువుచు నీళ్లు తనపైఁ జల్లుకొనవలయును.
నీళ్లు లేనియెడ నీక్రిందిపద్యము వాడవలయును.]

క॥ నారాయణ! నీనామో
చ్చారణమున శుద్ధినొంది చనుననుఁబాయన్
దూరముగాఁ దోలుము నా
ఘోరపుఁబాపముల, నిన్నుఁ గొల్చెదమదిలోన్॥

పశ్చాత్తాపము.

[సంధ్యావందనంబునఁ బశ్చాత్తాపంబు ముఖ్యంబుగావున దా
నివలన బాగుపడఁదలఁచినవారు తమయింద్రియములలోఁ బ్రతిదా
నిచేతనూ జేసిన చెడుపనుల నన్నింటిని దలంచుకొని, అవి చేసినం
దులకు మిగులవగచి, అట్టివి మరలఁజేయమని నిశ్చయము చేసికొ

నవలయును. ఆనిశ్చయప్రకారము నడుచుటకుఁ బ్రయత్నము చే యునపుడు దానికి విరుద్ధముగా నడుచుటకు మనస్సు పుట్టినను లోఁబడక తమ యేర్పాటు తప్పకుండునటుల నిబ్బరముగానుం డ మొదలుపెట్టినఁ గ్రమక్రమముగాఁ జెడుపనులుచేయుటయు, చె డుమాటలు మాటలాడుటయు, చెడుతలంపులు దలంచుటయుఁ బోయి తాము పరిశుద్ధులగుదురు. ఇదియే పశ్చాత్తాపమువలనఁ గావలసినపని. ఇదియే తాము బాగుపడఁదలంచినవారు మొదటఁ బొందవలసిన ఫలము. మనస్సు, మాట, పని- అను త్రికరణములం బరిశుద్ధులగువారే లోకమునకుపకారము చేసి, దానివలన నిజమ గుసుఖమును బొందఁ గలుగుదురు. ఇదియే జన్మమెత్తుటకు ఫలము.

కావున మానవులమనుకొనువారందఱును మొదటనే యిం ద్రియములజయించుట కష్టమనియూరకుండక నిబ్బరముతోఁబ్రయ త్నము చేసిన సులభమగునని యెఱింగి, ప్రయత్నించి, వానిని జ యించి, మఱి వారనిపించుకొని, తాము స్వచ్ఛసుఖమునొంది, లో కమునకు మేలుచేసి, తమ జన్మము కృతార్థముచేసికొందురుగాక.]

సీ॥ కానిభోగంబులఁ గాంక్షింపఁజేసెడి
కామంబువల్లను గలుగుదోసఁగు,
తనతోడివారల మనసులునొప్పించు
క్రోధంబువల్లను గూడుదోసఁగు,
పైవారలకుఁ దోడుపడకుండ నడ్డెడు
లోభంబువల్లను లోఁగు దోసఁగు,
ఒకటిమఱొకరీతి నున్నట్లుతోఁపించు
మోహంబువల్లను మూఁడుదోసఁగు,
ఇతరులకుంగీడు నేనొనర్చించెడు

మదమువల్లను నెప్పు డొదవుదోసంగు,
పెఱవారు సుఖపడఁ బ్రీతినోర్వఁగనీని
మచ్చరంబువలన వచ్చుదోసంగు,
మఱియు నెన్నెన్నిదోసంగులో మఱుఁగుపాటు
గా నెసంగెడి మానసికమగు పాప
మేమియేన్ రాత్రిచేసితి నేనిదాని
నికఁ గ్షమగువగ విచ్చున నీఱొనర్పు॥

సీ॥ కనరానిపై యందగత్తెల సొగసులు
గను కంటివల్లను గలుగుదోసంగు,
వినరానిమాటల వేడుకతోడుత
వినెడువీనులవల్ల నొనరుదోసంగు,
పీల్వఁగారానిచో విలసిల్లుకమ్మ తా
వులఁబీల్చుముక్కుచేఁ బొందుదోసంగు,
తినరానివస్తువుల్ దిని ద్రాఁగరానివి
గ్రోలు నాలుకవల్లఁ గూడు దోసంగు,
తాఁకరానివి తాఁకెడు త్వక్కువలని
దోసంగునవెడి జ్ఞానేంద్రియ దురితసమితి
నేమియేన్ రాత్రిఁ జేసితి నేనిదాని
నికఁ గ్షమగువగ విచ్చున నీఱొనర్పు॥

సీ॥ తిట్టులు కొండెముల్ వట్టిమాటలు కల్ల
లాడునోటివలన నబ్బుదోసంగు,
కొట్టి కూడనివానిఁ బట్టియూరక చంపు
చేతివల్లను లభించెడుదోసంగు,
చెట్టుగాఁదగనిచో మెట్టి ప్రాణులహింస

గావించు కాలిచేఁ గలుగు దోసఁగు,
చెడుఁదలంపునఁగూడి చెడుపనుల్ చేయఁజా
చెడుమగగుటి చేతఁ బడయుదోసఁగు,
ప్రాణిబాధగావించెడి పాయువువల
నిదోసఁగ నెడికర్మేంద్రియ నికరదురిత
మేమియేఁ రాత్రి చేసితి నేనిదాని
నిక్కమగువగ చిచ్చున నీఱొనర్పు॥

[పై మూడుపద్యములు చదువుటకు మొదలుపెట్టుటకు ముం దాచమనమునకువలె నీళ్లుంచుకొని చివరకు వచ్చినప్పుడు మూడు సారులు నీటిని దాఁగవలయును. ఆఁడువారు రెండవపద్యమున 'పైయందగత్తైల' బదులు 'పైయందగాఱుల' అనియు మూడవప ద్యమున 'మగ' బదులు 'ఆఁడు' అనియు వాడుకొనవలయును.]

చ॥ ప్రతినిమిషంబునందరయఁ బాపములెన్నియొ చేయుచుందు; ప
గతినవియెల్లఁబాపుకొనఁ గల్గుదునో కరుణాసముద్ర! నీ
వతికరుణాప్రసన్నమతి నడ్డగవచ్చి భయార్త నన్ను వి
స్తృతముగఁగావకున్నయెడ; తోఁచదు, కావవె నీకుమ్రొక్కెదన్॥

క॥ తెలియకకొన్నియుఁ దెలిసియుఁ
దెలియకమఱికొన్ని, తేటతెల్లముగా నే
తెలిసి మఱికొన్ని పాపం
బులు సలిపెద నన్నునెటుల బ్రోచెదవాహరీ!

గీ॥ నీదుకన్నుఁగప్పి నేనొనరింపఁగాఁ
గలుగుపాపమేమి గలుగు? కాన
నేనొనర్చినట్టి నిఖిలపాపంబులు
క్షమనుగావఁగదవె సర్వసాక్షి!

గీ॥ దేవదేవ!—అనుపద్యముమరలఁజదివి యాచమించి న
మస్కరించి

గీ॥ నినుఁదలఁచుచుం, పశ్చాత్తాపముననుజావ
నమగు నీనీరు చిలుకుట నాదుపాప
వహ్నిచల్లారినాకుఁ దాపంబుసేయ
కుండుఁగావుత నీదయ నోమహేశ!

[అనుచు నీళ్లుపైని జల్లుకొనవలయును. నీరులేనిచో]

గీ॥ నినుఁదలఁచుచుఁ బశ్చాత్తాపమునమునుంగు
కారణమున నన్నిప్పుడు గాల్చుపాప
వహ్నిచల్లారినాకుఁ దాపంబుచేయ
కుండుఁగావుతనీదయ నోమహేశ!

సీ॥ జగమంతయునుగూడ జంతుసంతతితోడ
నిండియుండునుగాన నేనుహింస
గావింపకుండుట కలుగదు; మఱియందుఁ
గర్మవశంబునఁ గలుగుదాని
నేనింతదప్పింప నేరనుగావున
దానికిఁజింతింపఁ నౌనె? కాని,
అటుగాక నావల్ల నగునన్నివిధముల
పాపంబులకుఁజాలఁ బరితపింతు;
ఇఁగమఱిట్టివి చేయనంచూగివచింతు;
ఇంద్రియములలోఁబలుపఁగా హెచ్చరింతు;
మనిచి తప్పులరక్షింపుమనితలంతు;
అఖిలలోకేశ! దీనజనార్తిహరణ!

గీ॥ ఇంకనేనెఱిఁగినవఱకెట్టితప్పుఁ

జేఁతలుం జేయఁ జేయను జేయఁ జేయ;
బుద్ధివచ్చెను; ఇంతకుఁ బూర్వమున్న
పాపములరూపుమాపుము పాపహరణ!

సీ॥ తెలియని పనులచేఁ గలుగు దురితము ద
యంగావవేయంచు నడుగువాఁడ;
తెలిసి తెలియములఁ గలుగుపాపంబును
విసువకపోఁగొట్ట వేఁడువాఁడ;
తెలిసి తెచ్చుకొనిన బలు దోసఁగలుగక
మన్నింపుమని బతిమాలువాఁడ;
నాదగు బుద్ధిహీనతకు నన్నే నేను
నిందించికొని మదిఁగుందువాఁడ;
నేనొనర్చినతప్పుల కెదనుమిగుల
వగచివిడిచెడు కన్నీటి వాననాదు
కలుష పంకంబు నంతయుఁ గడిగి వేసి
నన్నుదయచేసి పోశివు మాపన్న వరద!

గీ॥ నిన్ను ధ్యానించి, చేసిన యన్నిపాప
ములకు మానసమున నిజముగను వగచి,
వగపునిప్పునఁ బాపంబుఁ దగులఁబెట్టి,
శుచినియయి నీకుఁ గేల్మోడ్చి, స్తుతియొనర్తు॥

## కృతజ్ఞతాపూర్వ కార్యప్రదానము.

గీ॥ నాదుకష్టంబులకు వచ్చియాదుకొనుచు
నన్నుఁగాచు నీకుం దగినమఱు మేలు
నొసరుపంజాల; కావున నుడుతభక్తి

యనునటుల యర్ఘ్యమిచ్చెదఁ గొనుము దేవ!
[నీరు లేనిచో నాల్గవపాదమునకు బదులు]
యనునటుల వందన మొనర్తుఁ గొనుము దేవ॥
(అని నమస్కరింపవలయు.)

సద్గుణప్రార్థన.

గీ॥ పాపములను, వానిఁ బ్రభవింపఁజేసెడు
పనుల, వానిఁజేయఁ బాలుపడెడు
నింద్రియములనణఁప నే వేఁడితినిగాన
నింక మంచిగుణము లీనడిగెద॥

సీ॥ అన్నిశుభంబుల కాకరంబగునీదు
పాదపద్మంబుల భక్తినీవె;
కనిపెంచి పెద్దగాఁ గావింప శ్రమపడు
తల్లిదండ్రులభక్తిఁ దగనొసఁగవె;
విద్య బుద్ధియునిచ్చి వెలయింపఁగలిగెడు
గురువులయెడభక్తిఁ గూర్పఁగదవె;
సర్వసద్గుణములు సమకూర్పఁజాలెడు
సజ్జనస్నేహంబుఁ జాలనిడవె;
పెద్దలహితోపదేశంబు విననొనర్చి
బాగుచేసెడియణఁకువ పాదుకొలుపు;
తనకునితరులకును మేలు నొనరుపఁగల
సత్యతననుగ్రహింపుము సత్యరూప!

సీ॥ కామాదిచోరులఁ గట్టిపెట్టంగల
శమమునొసంగవె శమనిధాన!

బాహ్యేంద్రియంబుల బంధింపనోపిన
దమము చేకూర్పవే దమనిశాంత!
మంచిచెడ్డలను గుర్తించునట్టులచేయు
ధర్మంబునీయవే ధర్మమూర్తి!
పెనుచిక్కులొదవిన విధులను జేయించు
ధైర్యమునిడవె యోధైర్యభూష!
ఉన్నదానికిసంతోష మొందఁజేయు
తుష్టిసమకూర్పఁగదవె సంతుష్టిరూప!
అందఱిందనవలెఁజూడ నాచరించు
సర్వసమతప్రసాదింపు సర్వసముఁడ!

మ॥ దురహంకారముఁబాపువిద్య,ఇతరుల్ దుఃఖంబులంబొందుచో
సరిగాఁబంచుకొనంగఁజేయుకరుణన్,సత్కార్యముల్ చేయుచో
స్థిరతంగూర్చెడుస్థైర్యమున్,కుజను లుద్రేకించిబాధించుచోఁ
బరితాపంబునకోర్వఁజేయుక్షమ నాపట్లంబ్రసాదింపవే॥

చ॥మనసును,మాట,కార్యమొకమాడ్కినెయుండనొనర్చు నార్జవం
బును,తనకున్నదార్తులకు మోదముతోనిడఁజేయుదానముల్,
తనకడకెట్టిసాధులను దగ్గడపెట్టకచేర్చుమార్దవం
బును దయచేయవేపరమపూరుష!సద్గుణభూష!ఈశ్వరా!

క॥ తనసుఖము లెక్కసేయక
యనవరతముఁబరులమేలె యాపాదింపం
గనుఁగొనుపరోపకారము
మనమున వేరూనఁజేయుమా పరమాత్మా!

గీ॥ తనమకీర్తి నెల్లప్పుడు మనుపఁజాలు

మహిమనొప్పారు దేశాభిమాన సుధను
నాదుడెందంపు బావి నిండఁగనొనర్చు
మఖిలలోకాభిమాన! దయాసముద్ర!

గీ॥ నీదుచిత్తమెట్లున్నదో నేనెఱుంగఁ
గాని, స్వర్గంబు మోక్షంబుఁ గాంక్షసేయు
టదియుస్వార్థపరత్వమే యగునుగానఁ
బరులకై యెప్పుడిటఁ బాటు పడ నెతలఁతు॥

గీ॥ ఇంకముందెట్లుజరుగునో యెఱుఁగరాదు
గాని యీజన్మముననైన నేనుదలఁచు
చందమున జరుగఁదగిన సాధనంబు
లిమ్ము పరమాత్మ! నినుభక్తి నెంతుమదిని॥

గీ॥ దేవదేవ——అను పద్యముచదివి యాచమించి నమస్కరించి-

ఉ॥ ఱెక్కలులేనిజంతువులు ఱివ్వునఁబైకెగురంగఁజూచునే
నొక్కరిటఁ గూలకెందయినునుప్పరమందునఁబోవఁజాలునే!
అక్కట! అట్లెమానవులు నాదియునంతము లేనినిన్నుఁదా
మెక్కవగాఁబ్రయత్నపడి యేనియుఁజేరఁగఁ జాలరీశ్వరా!

సీ॥ ఎందుకీలోకంబు నెల్లఁ బుట్టించి ర
క్షించి త్రుంచిమరల్తొ చెప్పరాదు;
ఎందుకీవంతట నెసఁగుచునుండియు
నేరికిఁ గనరావొ యెఱుఁగరాదు;
ఎందుకు మనుజు లనేకభంగులఁబోవ
మిన్నకయుండెదో యెన్నరాదు;
ఎందుకునరులకు ముందువెనుకలస్థితి
గనుశక్తియీయవో కానరాదు;

ఎందుకీమొఱ్ఱ? నీలీలలెల్లు తెలియు?
చపలమగు మది యిటునటుఁ జనుచునుండు,
దానిబంధించి చేర్పు నీ ధ్యానమార్గ
మందు, సర్వేశ! నినుఁగొల్తు డెందమందు॥

ప్రార్థనారూపజపము.

క॥ దేవా! నిను వేఁడెదనీ
సేవకునకు విద్య బుద్ధి చేకూరిచి, వీ
లౌవఱ కితరులకున్ మే
ల్గావించి తరించునటుల కరుణింపఁగదే॥

[ఇది పదిసారులకుఁ దక్కువగాకుండ, వీలుకొలఁది నెక్కువ
గా నేకాగ్రబుద్ధితో జపింపవలయును. పలుమాటలేల? జ్ఞానాభి
వృద్ధి నొందించున దగుటచే విద్యయును, ఆవిద్యవలనఁ గలుగు జ్ఞా
నమును సరిగా వాడునటుల చేయించున దగుటచే బుద్ధియును,
ఆ విద్యాబుద్ధులవలనఁ దేలునది- జన్మమెత్తినందులకు ఫలము పరు
లకు నుపకారము చేయుటయే- యగుటచే వీలగునంతవఱకుఁ బరు
లకు మేలుచేయుశక్తియుమాత్రము కోరఁదగినవి; కావునఁ దమవి
ధి నెఱిఁగినవారికి నెప్పుడు నిదియే జపమైయుండు. కాన మానవు
లందఱు నిదియే యెప్పుడు తమజపముగాఁ జేసికొని, దైవానుగ్ర
హమునొంది తమజన్మములు సఫలములుగాఁ జేసికొందురుగాక.]

నడిమివందనము.

ఉ॥ ఎల్లెడనిండియుండియును నేరును నీ కలరూపెఱుంగఁగాఁ
జెల్లనిరీతినొప్పెదు విచిత్రచరిత్ర! ఇనాదిగోళముల్
పెల్లుగనాకసంబునను వింతగఁబట్టొక యింతలేకరా

జల్లి చరించి వచ్చునెడ సేగిని బొందక నైజమార్గముల్
దుల్లకయుండఁ జూచుచుఁ గడుం వెఱఁగొ గతి నార్చుచుండునో
సల్లలితప్రభావ! కనఁ జక్కఁగ లెక్కిడ వీలొసంగకే
వల్లను నూది మోపుటకుఁ బాల్పడనీయని యట్లు తానెమై
కొల్లగనుండు జంతుతతిఁ గోరిక నే సృజియించి పెంచుచుం
జల్లఁగఁ బెళ్లునందు నిమి సాఁగఁగ నంపుచు, వల్లియట్టులే
యుల్లసిలంగఁ జేయఁగ, అహాహా! యివి చచ్చి జనించినట్టివా?
చెల్లదు; క్రొత్తవా? యిదియుఁ జెల్లదటంచనుకొంచు నెందఱో
యుల్లమునందుఁ బెక్కులగు నూహలు చేసియు నిద్దనిక్కవా,
కల్లయిదంచుఁ దేల్చు నవకాశ మొసంగక చూడఁ జూడఁగాఁ
బల్లుగఁ దోఁచి తెల్వికను ప్రాఱక చీఁకటి కమ్మ, డెందముల్
తల్లడమందఁగా నహహా! దైవమ! నీమహిమం బగమ్యమౌ;
మెల్లఁగఁ గొల్చుకంటెనిఁక మే మొనరించునదేమి యంచెదం
జల్లఁగ నిన్నె నమ్మి తమ శక్తికొలందిని మంచిత్రోవనే
వెళ్లి పరోపకారము నె పెద్దగఁ జూచుచుఁ దోడు సూపుచున్
వెల్లువబుగ్గ ప్రాణిమిది పెంపఱు నెప్పుడొ యంచుఁ గాలమున్
వెళ్లఁగఁ బుచ్చునట్లొనరుపింపఁగ జాలు నగమ్యశక్తి! నా
వల్లను గల్గు లోపములఁ బాపి కృతార్థునిఁ జేయు మ్రొక్కెదన్॥

## ఋషీశ్వరాది వందనము.

క॥ కనరాని నిన్నుఁ గనుఁగొనఁ
జను తెలివిని దనరు మానిచంద్రులకు, ననుం
గని పెంచి బుద్ధి యిడు గురు
జనములకును మ్రొక్కులిడెద జగదాధారా!

సీ॥ పరమేశుఁ గనుఁగొన్న ప్రార్థినొప్పిన ముని
వరులార! మీకిదే వందనంబుః
ననుఁగని పోషింప ఘనతర కష్టముల్
పొందిన పితలార! వందనంబుః
విద్య బుద్ధియుఁ జెప్పి వెలయింపఁ బలుపాట్లు
పడినట్టి గురులార! వందనంబుః
కష్టకాలమున వార్ధన సహాయములీయ
వచ్చు సజ్జనులార! వందనంబుః
కోర కూరకయే మేలు కూర్పఁజూచు
భవ్యగుణులార! మీకిదే వందనంబుః
చెడి చెడుట కూడదంచు నెప్పుడును జాటి
కుంపు నరులార! మీకును వందనంబు॥

## ఫలప్రార్థనము.

సీ॥ అన్యుల మేలుకై యత్నించు సజ్జనుల్
తుదిలేని సౌఖ్య మొందెదరుగాక!
నేను మనన్ హేతువైన నాపితరులు
తుదిలేని సౌఖ్య మొందెదరు గాక!
నా తెలివికిఁ గారణంబైన నాగురుల్
తుదిలేని సౌఖ్య మొందెదరు గాక!
నాకుఁదోడగుచుండు నామిత్రులందఱుఁ
దుదిలేని సౌఖ్య మొందెదరు గాక!
పాపులే నెల్లరుఁ బాపంబు నెడఁబాసి
తుదిలేని సౌఖ్య మొందెదరు గాక!

మానవులుగాక మిగిలిన హీనజంతు
బృందము ననంతమగు సౌఖ్యమొందుఁగాక!
పనుసేయాన నడుచుచు నితరుల కుప
కృతియొనర్చుచు నుండి తరింతుగాక!

తుదివందనము.

సీ॥ అఖిల లోకంబుల కాధారమగునట్టి
పరమేశ! నీకిదే వందనంబు;
అఖిల ప్రపంచంబునందు నిండి వెలుంగు
పరమాత్మ! నీకిదే వందనంబు;
బ్రహ్మాండమంతయుఁ బాలించు చుండెడి
పరశక్తి నీకిదే వందనంబు;
అంతయుఁ జేయుచే వంత లేకుండు నా
నందాత్మ! నీకిదే వందనంబు;
మనుజనికరముఁ బశుచయమును ఖగోత్క
రమును జలచరముఖ జంతుసముదయంబు
స్థావరగణంబుఁ గ్రమముగాజరుపునో ప్ర
పంచభర్తా! యిదేనీకు వందనంబు॥

మార్గప్రదర్శనప్రార్థన.

గీ॥ ఇఁక శరీరయాత్ర కేగెడు వాఁడను,
తప్పుఁదోవఁబట్టి తల్లడిలక
మంచిదారిఁ జేరి మనసార సుఖపడు
పగిదిఁ జూడఁగదవె భక్తపాల!



# మధ్యాహ్నసంధ్యావందనము.

ప్రాతస్సంధ్యావందనమునఁ గాలమును దెలుపు పదములను మార్చిన నదియే మధ్యాహ్నసంధ్యావందనమునగు.

మార్పులు.

దీక్షయందు— 'ప్రాహ్ణుటి' బదులు 'మధ్యాహ్న'.

పశ్చాత్తాపమున— 'మేమియేన్ రాత్రిచేసితి' బదులు 'మేనుబ్రొద్దుటఁజేసితి'.

కొందఱికి మధ్యాహ్న సంధ్యావందన మంతయు సరిగాఁ జేయుటకు వీలుండదు. అట్టివారు సమయ వీలగునంతవఱకు మనస్సునఁ జేసికొనుట మంచిది. అందులోఁ బశ్చాత్తాపమును, జపమును ముఖ్యములు.

# సాయం సంధ్యావందనము.

ప్రాతస్సంధ్యావందనమునఁ గాలమును దెలుపు పదములను మార్చిన నదియే సాయం సంధ్యావందనమునగు.

మార్పులు.

దీక్షయందు— 'ప్రొద్దుటి' బదులు 'మాపటి'.

పశ్చాత్తాపమున— 'రాత్రి' బదులు 'పగల్'.

ఈసాయంసంధ్యావందనము కూడఁ బ్రాతస్సంధ్యావందనంబువలెనె యందఱుఁదప్పక చేయవలయును. మధ్యాహ్నసంధ్యావందనము సరిగాఁ జేయుటకు వీలులేనివారెక్కువ జాగరూకతతోఁ జేయవలసియుండు.

# పండుకొనఁబోవునప్పటివందనము.

గీ॥ నేఁటికి శరీరయాత్రను నేముగించి
నాఁడ నయినను దానిలో నాకుఁ దెలిసి
నవియొ కొన్నియుఁ దెలియని యవియుఁ గొన్ని
పాపములు చేసియుందుఁ గాపాడు దేవ!

క॥ కదలక మనస్సు చేతను
గదలుచు మఱి వాక్కుచేతఁ గాయముచేతం
చుదిలేని దొసఁగు లొదవును
సదయత ననుఁ బ్రోవఁగదవె సదమలరూపా!

గీ॥ అకట! నేఁడు నేఁ జేసిన యట్టిపాప
మును దొలఁప సంధ్యలందు వందనము చేసి
యున్న నపుడైన నామది తిన్నఁగా నె
యున్నదనఁ జాల నెటుగాఁతో మెన్నఁజాల॥

గీ॥ పనుమంచిగ నడువ నే యెంతో యత్న
మాచరించుచునుండిన నడ్డువచ్చి
తప్పుదారులఁ బట్టించి తల్లడిల్లఁ
జేయు మదిదొంగ నే నేమి చేయువాఁడ?

గీ॥ ఇంటిదొంగను బట్టఁగా నీశ్వరునకు
నైన శక్యమె యనుమాట నతిశయించె
నీమనసుదొంగచర్యః హా! యెఱఁగి యెఱఁగి
పట్టఁజాలః ఇఁ కేగతి? పరమపురుష!

క॥ ఒకనేళఁ బట్టుపడినను
సుకరముగాఁ దప్పిపోయి చోద్యముగానొం

డొకనిమిషంబున నెప్పటి
రకమునఁగలఁచుం బరాత్పరా! యేమందున్॥

గీ॥ పట్టువడియొక్క వేళను గట్టఁబడినఁ
గట్లుకళ్లుగనుండనే యెట్లొజాఱి
నొక్కఁబడి విడివడుగాలిఫక్కి ముందు
కంటెఁజెలరేఁగిబాధింపఁ గడఁగుదేవ!

సీ॥ తక్కెడల్లోనుంప దానిలోనుండక
తప్పించుకొనిదాఁటు కప్పవోలె,
పట్టి బుట్టంబెట్ట మట్టుగానుండక
మిడిసిపడుచునుండు మీనువోలె,
కట్టిపెట్టిన తాళ్లు కఱకుపండ్లంబట్టి
కొఱికిఁ బైకుఱికెడు కుక్కవోలె,
వలఁజిక్కియును దాని నలిగాఁగరాపాడి
పాఱిపోవునడవి పందివోలె,
నేను నిలిపినస్థలమున నిలువకయిటు
నటుఁ దొలఁగిపోయి ననుఁజాల నలఁచుచున్న
మనసుతోఁబోరునామీఁదఁ గనికరించి
తోడుపడిదానిలోఁబర్చు, వేఁడుకొనెద॥

గీ॥ మనసు లోఁబడకున్న నేపనియుఁగాని
సరిగఁగాఁ జాల దందుచే సర్వశక్తి!
దాని లోఁబర్చుకొనుటకుఁ దగినశక్తి
యిమ్ము దానితోనె నిను ధ్యానమ్మొనర్తు॥

గీ॥ దొంగలకు స్థానమామది దొరకెనేని
దొంగలగు కామముఖ్యులు దొరకఁగలరుఁ

అటులయింద్రియ చయము లోనయ్యె నేని
గెలువరానిది యెయ్యది గలుగు? దేవ!

గీ॥ ఇంతకట్టి చిక్కులకెల్ల హేతువైన
మనసునడ్డుగ నెందుల కునిచితనుట
తప్పు; అది లేనిచో నేముఁదగుదుమనుచుఁ
జేయునదియేమి? నీమది చెలఁగు టెట్లు?

గీ॥ నీయెడల లోపమెంచుట నిప్పులోన
మిటికియున్నది యనుట యో పుణ్యమూర్తి!
కానవీయందు దోషంబు గలుగదింత;
ఉన్నదంతయు నాయందె యుండుఁగాని॥

గీ॥ ఇంత శేఁ జేసినట్టి మేలేమి? సున్న;
చెడ్డయో? అంతయునదె; నీ చిత్తమింక,
నన్ను నెట్టులకాపాడ నెన్నినావొ?
దిక్కునీవే యటంచు నే మ్రొక్కువాఁడ॥

సీ॥ ఎన్నఁడు నేను నాయెదను గెల్చితినంచు
నానంద సుధఁ దేలియాడఁ గలనొ?
ఎన్నఁడు నేను నాయింద్రియమున దేనఁ
బాపము లేదని పలుకఁ గలనొ?
ఎన్నఁడు నేను నాయిచ్ఛ వచ్చినరీతి
నిన్నుఁ గొల్చితినంచు నెన్నఁగలనొ?
ఎన్నఁడు నేను నాకితవగు తెఱఁగున
మంచి చేసితినంచు నెంచఁగలనొ?
ఎన్నఁడు నేను నాయెత్తినజన్మంబు
సార్థకమయ్యె నంచనఁగఁగలనొ?

ఎన్నఁడిఁక నేను జచ్చిన నేమిభయము
పొమ్మనుచు ధైర్యమునఁ గన్నుమూయఁగలనొ?
అట్టి సుదివము సాధ్యమా నంతత్వరగ
నాకొసఁగు నిన్నుఁగొల్తు నానందరూప!
గీ॥ అట్టి భాగ్య మిప్పటికి నాకమరలేదు
గాన నినునమ్మియే యిప్డు కన్నుమూసి
నిత్యమరణంబు నొందెద నిత్యరూప!
మనిచి నన్ను నీసేవకు మరలఁ దెమ్ము॥

[అని ప్రార్థించి పరాత్పరుఁ దలంచుచు నిద్రింపవలయు. ఆఁడు వారు 'వాఁడ' అని వచ్చినచోట 'దాన' అని వాడుకొనవలయు.]

---

భోజనమునకుముందు చేయవలసిన ప్రార్థన.

గీ॥ దేవదేవ! నేనిప్పుడు తినఁదలఁచెడి
యీపదార్థములవలన నెసఁగు బలము
నాకుఁ బరులకు దేశంబునకును మేలు
చేయుపనులకె పనికిరాఁ జేయఁగదవె॥

[అని పరాత్పరుఁ బ్రార్థించి, తాము తినఁదలఁచిన పదార్థముల నీశ్వరునకర్పించి, వానివలనఁ దమకుఁ గలుగు బలము మంచిపనులయందే కాని చెడుపనులయందు నుపయోగింపమని నిశ్చయ మొనర్చుకొని తినవలయును. శరీరము మనవిధి చేయుటకు ముఖ్యసాధనమగుటచేతను, ఆశరీర మాహారములేక పనిచేయఁ జాలకపోవుటచేతను, కోటివిద్యలును గూటికొఱకను సామెతరీతిని మనము మొదటఁ బ్రతుకుఁదెరువు జూచుకొనవలసియుండు. అయినను

మనబ్రతుకంతయుఁ దిండికొఱకే యనుకొనఁదగునా? తగదు. మ
నము మనుష్యజన్మమెత్తినఫలము- విద్యాబుద్ధులు నేర్చుకొని బాగు
పడి న్యాయమార్గమున నడుచుచు మంచివారనిపించుకొని, వీలగు
నంతవఱకు నితరులకు నుపకారముచేయుచు, దేశాభివృద్ధికిఁ బాటు
పడుచుండుటకాని, లేచినది మొదలు పండుకొనఁబోవువఱకుఁ దిండి
కొఱకును, అదియైనతరువాత నెండమావులవంటి శరీరసంబంధ
ములగు తుచ్ఛసుఖములకొఱకును జూచుకొనుట కాదు. కాఁబట్టి
తిండివలనఁ గలుగవలసిన ఫలము శరీర పోషణమును, దానితరు
వాత మనజన్మమును సార్థకముచేసి మన పేరు శాశ్వతముగానుం
డునట్లు చేయఁగల పరోపకార దేశాభివృద్ధులకొఱకుఁ బాటుపడు
టయు నే కాని, తుచ్ఛసుఖములకొఱకుఁ గాలముపాడుచేసి జన్మము
వ్యర్థము చేసికొనుట కాకపోవుటచే మనము శరీరమునకు బలమిచ్చు
వస్తువులు మాత్రమె కొనవలయునుగాని మత్తుచేసి కామక్రోధా
దులఁబెంచువస్తువుల నెంతమాత్రము గొనఁగూడదు. ఈసంగతినె
ఱింగి మనుష్యులందఱు శరీరపోషణమునకుఁదగిన మంచిపదార్థము
లనేపుచ్చుకొని, వానివలనఁ గలుగుబలము తమకును, పైవారికిని,
దేశమునకు మేలుచేయుపనులయందే యుపయోగపఱిచి, తమజన్మ
మునఫలముచేసికొని, తమపేరు స్థిరముగానిలుపుకొందురుగాక.]

గీ॥ దేవదేవుఁ డిచ్చుకొలఁది తెలివిఁబట్టి
తోడివారల కొకయింత తోడ్పడునను
నాస నీచిన్నిపొత్తంబు వ్రాసెఁగడఁక
సకలహితమతి,
మా॥ రామచంద్రశాస్త్రి.

# తెలుఁగుసంధ్యావందనము.

## అర్థములు.

సంధ్యావందనము=సంధ్యాకాలములయందు మేలుగోరి పరాత్పరుని గూర్చి చేయువందనము. సాధారణముగా సంధ్యలుమూడు:— ౧ ప్రాతస్సంధ్య=రాత్రియుఁ బగలును గలియుకాలము. ౨ మధ్యాహ్నసంధ్య=పూర్వాహ్ణమును, అపరాహ్ణమును గలియుకాలము. ౩ సాయంసంధ్య=పగలును రాత్రియుఁ గలియుకాలము. ఇందు జాగ్రత్సుషుప్త్యవస్థల సంధ్యలును గలుపఁబడినవి. జాగ్రత్తు=మేలుకొనియుండుట. సుషుప్తి=నిద్ర.

శరీరయాత్ర=శరీరమును బోషించుకొనుటకుఁ జేయుపని.

దురితము=పాపము=చెడుపని.

2

ప్రతిజ్ఞ=తప్పక చేయుదుమని నిర్ణయించుకొనుట.

హరి=అన్నిపాపములను బోఁగొట్టువాని.

ఆచరించి=చేసి.

నారాయణ=జ్ఞానమునకు స్థానమగువాఁడ.

వాసుదేవ=అంతటనుండి ప్రకాశించువాఁడ.

అధోక్షజా=ఇంద్రియముల జయించినవాఁడ.

అచ్యుతా=నాశనములేనివాఁడా.

సర్వశక్తి=అన్నిశక్తులుగలవాఁడ.

సమాయించి=నశింపఁజేసి.

సర్వాంతరగతి=అన్నిటిలో నుండువాఁడు.
సర్వసాక్షి=అన్నియుఁజూచువాఁడు.
నిఖిలరూప=అన్నిరూపములు నీవెయగువాఁడు.

3

సర్వజ్ఞ=అన్నియుఁ దెలిసినవాఁడు.
అనుపీని=వీలుకలుగఁజేయని.
నిర్వికార=మార్పు లేనివాఁడు.
అభిమతము=కోరిక.
తత్త్వము=నిజమగుస్థితి.
ఇంద్రియనిరాకరణము=ఇంద్రియములఁ దిరస్కరించుట. (ఇంద్రియములలోఁబఱుచుకొనుట.) ఇంద్రియములు ౧౧-౧ మనస్సు. (ఇదియే లోపలియింద్రియము.) ౨ కన్ను ౩ ముక్కు ౪ చెవి ౫ నాలుక ౬ చర్మము- ఈయైదు జ్ఞానేంద్రియములు. ౭ నోరు ౮ చేయి ౯ కాలు ౧౦ మూఁడి (మనముతిను పదార్థమున సారముపోఁగా మిగిలినపిప్పిని బైకివిడచునింద్రియము.) ౧౧ మగగుఱి — ఆఁడుగుఱి. (నీరుడువిడిచి, పుట్టువుకలిగించు నింద్రియము.)- ఈయైదు కర్మేంద్రియములు.
సారథి=బండితోలువాఁడు.

4

దీక్ష=నియమముచేసికొనుట.
పాపమార్జనము=పాపమును తుడిచివేయుట.
పశ్చాత్తాపము=మనముచేసిన తప్పులు తెలిసినతరువాత వానివలనఁగలుగుకీడు తెలిసికొని, అవి చేసినందులకు దుఃఖించి, అట్టివి మఱియెప్పుడును చేయమని నియమముచేసికొని యానియమప్రకారము నడుచుట.

5

కామము=కోరరానికోరికలఁ గోరునటుల చేయుదుర్గుణము.
క్రోధము=పైవారిమనస్సులనొప్పించునటుల చేయుదుర్గుణము.
లోభము=పైవారికి సహాయము చేయకుండునటుల చేయు దు
ర్గుణము.
మోహము=వస్తువుల యథార్థస్థితి తెలియకుండఁ జేయు దు
ర్గుణము.

6

మదము=పైవారికిఁ గీడుకూడఁ జేయించు దుర్గుణము.
మచ్చరము=పైవారుసుఖపడుటకోర్వనటుల చేయుదుర్గుణము.
మానసికము=మనస్సుసంబంధమైనది. (మనస్సుచేఁ జేసినది.)
వగచిచ్చున=విచారమనునగ్నిచేత.
నీఱు=భస్మము.
వీనులు=చెవులు.
త్వక్కు=చర్మము.
దోసఁగు=పాపము.

7

అతికరుణాప్రసన్నమతిన్=మిక్కిలి దయచే స్వచ్ఛమగు మన
స్సుచేత.
భయార్తు=భయముచే దుఃఖించువాఁడనగు.
విస్తృతముగ=మిగులఁగొనియాడఁదగినటుల.
క్షమను=ఓర్పుతో.

8

పాపవహ్ని=పాపమనునిప్పు.
తాపము=బాధ.

కర్మవశంబునన్ = కర్మము చేత.

కర్మము = ముందు చేసికొనిన మంచి చెడు పనుల ఫలము.

పరితపింతున్ = మిక్కిలి దుఃఖించెదను.

అఖిలలోకేశ = సమస్తలోకములకుఁ బ్రభువా.

దీనజనార్తిహరణ = భయపడువారి దుఃఖమును బోఁగొట్టువాఁడ.

9

కుందు = దుఃఖించు.

ఎదను = మనస్సున.

కలుషపంకంబుల = పాపమను బురదను.

ఆపన్నవరద = దుఃఖము నొందినవారి కోరిక లిచ్చువాఁడ.

కృతజ్ఞతాపూర్వకార్ఘ్యప్రదానము = చేసిన మేలు మఱవకుండుటను దెలుపుచుఁ బరమేశ్వరునకుఁ బ్రీతిగా నీరిచ్చుట.

ఆదుకొనుచున్ = సహాయపడుచు.

10

సద్గుణప్రార్థన = మంచిగుణములకొఱకు వేఁడుకొనుట.

ప్రభవింపఁజేసెడు = పుట్టునటుల చేయునట్టి.

ఆకరంబు = స్థానము.

హితోపదేశము = మొదట నింపుగా నున్నను తరువాత మేలు చేయు బోధ.

పాదుకొలుపు = స్థిరపడునటుల చేయుము.

శమము = కామము మొదలగు దుర్గుణముల నణఁచు మంచి గుణము.

శమనిధాన = శమమునకు స్థానమగువాఁడ.

## 11

బాహ్యేంద్రియములు=పైయింద్రియములు. (జ్ఞానేంద్రియకర్మేంద్రియములు.)
దమము=బాహ్యేంద్రియముల నణంచు మంచిగుణము.
దమనిశాంత=దమమునకు స్థానమగు వాఁడ.
తుష్టి=తనివి.
స్థిరత=స్థిరత్వము=నిలకడ.
ఉద్రేకించి=అతిశయించి.
ఆర్జవము=తిన్నఁదనము.
ఆర్తులకున్=దుఃఖపడువారికి.
మార్దవము=మృదుత్వము=మెత్తఁదనము.
ఆపాదింపన్=కలిగింప.
మనుపఁజాలు=రక్షింపఁగలయట్టి.

## 12

దేశాభిమానసుధను=దేశముమీఁది ప్రేమయనునమృతముతో.
డెందంపుబావి=మనస్సనునూయి.
స్వార్థపరత్వము=తన మేలునందలి యాసక్తి.
ఉప్పరము=ఆకాశము.

## 13

పరును=ఎవరును.
ఇనాదిగోళముల్=సూర్య చంద్రాదిమండలములు.
పెల్లుగ=అధికముగ.

## 14

సేగిని=కీడును.
డుల్లక=తప్పిపోక.
వెఱఁగొంగతిన్=వింతయగురీతిని.

పల్లు=గోయి.
అగమ్యము= తెలిసికొనరానిది.
వెల్లువబుగ్గ=ప్రవాహముమీఁది నీటిబుడగ.
జగదాధార=లోకమున కాధారమగువాఁడ.

## 15

ప్రౌఢి= నేర్పు.
పితలార=తల్లిదండ్రులార.
మనన్=బ్రతుకుటకు.

## 16

బృందము=సమూహము.
ఉపకృతి=ఉపకారము.
తరింతుఁగాక=కృతార్థుఁడనగుదునుగాక.
వంత=విచారము.
నికరము=సమూహము.
చయమును=సమూహమును.
ఖగోత్కరమును=పక్షులసమూహమును.
జలచరముఖ జంతుసముదయంబున్=నీటి జంతువులు మొదల
గు జంతువులసమూహమును.
స్థావర=ఒకచోటనేకదలకుండు వస్తువుల.
మార్గప్రదర్శనప్రార్థన=మంచి దారిఁజూప వేఁడుకొనుట.

## 18

కాయము=శరీరము.
తొలఁపన్=తొలగించుటకు.
గలడిల్లఁజేయున్=భయపడునట్లు చేయును.
మదిదొంగ=మనస్సునుదొఁగ.
సుకరముగా=సులభముగా.

19

ఒండొక = మఱియొక.

కలఁచున్ = బాధపెట్టును.

ఫక్కిన్ = రీతిని.

కడఁగున్ = ప్రయత్నించును.

మీను = చేఁప.

అలఁచుచున్న = బాధించుచున్న.

కామముఖ్యులు = కాముఁడు మొదలగువారు.

20

చెలఁగుట = సంతోషించుట.

ఎదను = మనస్సును.

దేనన్ = దేనిచేతను.

ఇతవు = హితము = మేలుచేయునది.

సార్థకము = సఫలము.

21

అమరలేదు = కలుగలేదు.

నిత్యమరణము = నిద్ర.

నిత్యరూప = శాశ్వతమగు రూపముకలవాఁడు.

మనిచి = కాపాడి.



